# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక



25-9-57

25 నయాపైసలు

ANDHRA PATRIKA
ILLUSTRATED WEEKLY



ఈత గీత

ఫొటో నందగోపాల్ — హైదరాబాదు.

సంవత్సర చందా
రు. 13—0—0
విడిప్రతిక 25 న.పై

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder: K. NAGESWARA RAO

సంపుటము 52
సంచిక 5
25-9-57

హేవిళంబి ఆశ్వయుజం, శుద్ధ ద్వితీయ, బుధవారం

 విషయానుక్రమణిక 

ముఖచిత్రం:
దీప్ అండ్ ప్రదీప్ ఫిలింస్‌వారి
'పాలీస్' చిత్రంలో
మధుబాల

★

# మకుటంలేని మలయా రాజు

"అనగనగా ఒకరాజు" అని ప్రారంభమయ్యే కథలంటే ఒకప్పుడు జనం చెవికోసుకునేవారు. ఇప్పుడిలాంటి కథలకు గిరాకీ తగ్గిపోయింది; రాజులకే గిరాకీ తగ్గిపోయినప్పుడు రాజులకథలకు తగ్గిపోవడంలో ఆశ్చర్యమేముంది? ఇప్పుడు ప్రజలు ప్రజలకోసం ప్రజల కథలురాస్తే ప్రజలు చదువుతారు. అంచేత ఇది ప్రజాయుగం.

రాజులంటే మోజుపడేరోజులుపోయినా, ఇంకా అక్కడక్కడ రాజులున్నారు. కొన్ని యూరప్ దేశాల్లోను, ఆసియా దేశాల్లోను, ఇంకా రాజులు ఉన్నారు. అయితే వీరు కేవలం నామమాత్రావశిష్టులైన రాజులు. అధికారాలన్నీ ఎక్కువగా ప్రధానమంత్రులవి. పార్లమెంటులవి. మంత్రిమండలికి లోబడే రాజుగారు పరిపాలిస్తూ ఉంటాడు. ఇప్పటి రాజరికాలకు మిగిలిన హక్కల్లా వారసత్వపు హక్కు ఒక్కటే.

అయితే ఈ హక్కుకూడా లేని రాజుగా రొకాయన ఉన్నాడు. ఈరాజు కిందటినెల మలయా ఫెడరేషనుకు రాజుగా "ఎన్నుకోబడ్డారు." ఎన్నుకోబడిన రాజుగనుక ఈయనకి వారసత్వపు హక్కు లేదు. అయిదేళ్లవరకే ఈయన రాజుగా ఉంటాడు. ఈయనపేరు సర్ అబ్దుల్ రహమాన్ ఇబిన్ అల్మర్హుం టువంకూ మహమద్. ఈయన బిరుదు యాంగ్ ది పెర్తువన్ అగాంగ్. దీని తాత్పర్యం మలయా ఫెడరేషనుకు సార్వభౌముడు అని.

మామూలు రాజులకు కిరీటం ఉండాలి. ఈయనకి కిరీటం లేదు. రాజదండాలు, గదలు కత్తులు అన్నీ ఉన్నాయి గాని అసలైన కిరీటము లేదు.



మలయాలో 9 సంస్థానాలు ఉన్నాయి. వీటిలో నెగ్రి సెంబిలాన్ అనే సంస్థానం ఒకటున్నది. ఈ సంస్థానంలో మళ్ళీ 9 చిన్న చిన్న సంస్థానాలున్నాయి. ఈ 9 చిన్న సంస్థానాల అధిపతులు కలిసి 1933లో తమ రాజప్రముఖుడుగా సర్ అబ్దుల్ రహమాన్ని నిర్ణయించుకున్నారు. ఆవిధంగా ఆయన నెగ్రిసెంబిలాన్ సంస్థానానికి అధిపతి అయ్యాడు. ఆ తరవాత సరిగ్గా 24 ఏళ్లకు మొన్న ఆగస్టులో మలయాలోని 9 పెద్ద సంస్థానాల వారూ కలిసి తమసార్వభౌముడుగా సర్ అబ్దుల్ రహమాన్ను ఎన్నుకున్నారు. ఈయనకంటే సీనియర్లు ఇద్దరున్నారు గాని ఈయన్నే ఎన్నుకున్నారు. దీనికి కారణమేమిటంటే, మొదటి వాడైన జోహారు సుల్తాను 82 ఏళ్ళ వృద్ధుడు. అందుకని ఆయన తనకు సార్వభౌమత్వం అక్కరలేదన్నాడు. రెండోవాడైన పెహాంగ్ సుల్తాను సార్వభౌమత్వమంటే ముచ్చటపడ్డాడుగాని, ఆయన జల్సా పురుషుడు. అంచేత ఆయనకి పదవిని కట్టబెట్టడానికి మిగతా వారిష్టపడలేదు. కనుక మూడవవాడైన నెగ్రి సెంబిలాన్ అధిపతికి సార్వభౌమత్వం లభించింది. ఈయన కిద్దరు భార్యలు, ముగ్గురు కొడుకులు, నలుగురు కూతుళ్లు. కొడుకుల్లో ఒకడైన టెంకూ జఫా వాషింగ్టన్లోని మలయన్ రాయబార కార్యాలయంలో ఇప్పుడు ఉద్యోగం చేస్తున్నాడు.

మలయా సార్వభౌముడు చిన్నప్పుడు బ్రిటన్లో చదువుకున్నాడు. బారిష్టరైనాడు. మలయాలో చిన్న చిన్న ఉద్యోగాలు చాలా చేశాడు. ఈయనకి ఫుట్బాలన్నా, టెన్నిసన్నా చాలా ఇష్టం. ఈయనకిప్పుడు 62 ఏళ్లు. ఆరోగ్యం చెడి ఇరవయ్యేళ్ళయింది. ఏమంత దృఢగాత్రుడు కాదు. చికిత్స నిమిత్తం చాలాసార్లు ఇంగ్లండు వెళ్లాడు. ఎక్కువ కష్టపడి పని చెయ్యలేడు. ఇప్పుడీయన ముఖ్యవ్యాపకం ఏమిటంటే, డిటెక్టివ్ కథలు రాత్రింబగళ్లు అదేపనిగా చదివెయ్యడం. ★




# అధికారభాషపై వివాదం

శ్రీకృష్ణ

[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

భాషావివాదం మళ్లీ విజృంభించింది. అధికార భాషాసంఘం నివేదిక ప్రకటింపబడడంతోనూ, దానిమీద రాష్ట్రపతికి సిఫార్సులు చేసేందుకు ఉభయసభలూ కొత్త సంఘాన్ని నియమించడంతోనూ ఈ వివాదం బాగా పుంజుకుంది.

వివాదగ్రస్తమైన విషయమిది: అధికార భాషగా ఇంగ్లీషు మానేసి హిందీని వాడడం 1961 నుంచీ మొదలుపెట్టాలా అక్కర్లేదా? దక్షిణరాష్ట్రాలు అక్కరలేదనీ, ఉత్తర రాష్ట్రాలు అక్కరఉందనీ వాదిస్తున్నాయి.

స్వాతంత్ర్యసిద్ధికి ముందు దేశమంతా మత సంఘర్షణలతో అల్లకలోలంగా ఉండేది. మసీదులముందు మేళతాళాలు, గోవధ—ఇవీ అప్పటి వివాదాలు. అయితే అసలు సమస్యలు రాజకీయ దాస్యం, ఆర్థిక పారతంత్ర్యం అనీ, ఈ సమస్యలనుంచి ప్రజల దృష్టిని మరల్చడానికే బ్రిటిష్‌ప్రభుత్వం ఈ మత వివాదాలను ప్రోత్సహించిందనీ అప్పట్లో అనేవారు. హిందూ ముస్లిం సంఘర్షణలు స్వాతంత్ర్యసిద్ధి తరవాత సమసిపోయినమాట నిజమే. కాని అల్లకల్లోలం సంగతేమిటి? రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సంఘనివేదిక ప్రకటింపబడినప్పుడు గతసంవత్సరం దేశం అల్లకల్లోలమైపోయింది. ఈ అల్లకల్లోలం భాషావివాదం మీదనే చెలరేగింది. అది కొంచెం సద్దుమణుగుతోందనేటప్పటికి మళ్లీ దాన్ని రేకెత్తించడం జరిగింది. హిందీ త్రిమూర్తులైన ఆచార్య పురుషోత్తమదాస్ టాండన్, సేఠ్ గోవిందదాస్, డా॥ రఘువీర—1961 నాటికల్లా భారతదేశమంతటా హిందీని బలవంతంగానైనా రుద్దాలని చూస్తున్నారు. ఒకవంక పంజాబులో హిందీవాదులకు గురుముఖివాదులకు, లంకలో తమిళవాదులకు సింహాళీవాదులకు, తూర్పు పాకిస్థాన్‌లో బెంగాలీ వాదులకు ఉర్దూ వాదులకు తగాదాలు చెలరేగుతున్నా, వీటిసంగతే తెలియనట్లు ఈ త్రిమూర్తులు తమ ప్రయత్నాన్ని సాగిస్తున్నారు.

అధిక సంఖ్యాబలంమీద ఆధారపడిన ప్రజాస్వామ్యం ఒకప్పుడు దేశ విభజనకు దారితీసింది. ఐక్య భారతదేశంలో హిందువులు తామే అధిక సంఖ్యాకులమని అన్నారు. అయితే హిందువుల పరిపాలన మాకక్కర్లేదన్నారు ముస్లిములు. మళ్ళీ ఇలాంటి నాటకమే ఇప్పుడూ జరుగుతోంది. అధికసంఖ్యాకుల భాష హిందీ అనీ, అందుచేత అదే అధికార భాషగా ఉండాలనీ ఔత్తరాహులవాదం. ఉత్తరాది వారిబలవంతానికి లొంగేది లేదని దాక్షిణాత్యుల పట్టుదల. తగాదా హిందీకి ఇంగ్లీషుకి మధ్యకాదు; హిందీకి తమిళానికి మధ్య. హిందీవాదులు తమ ప్రయత్నంలో ఒకసారి ఓడిపోయారు. ఏమంటే ఖేర్ సంఘం నివేదిక ఏకగ్రీవంగా ఒప్పుకుని తయారుచేసిన నివేదికకాదు. సహేతుకమైన చక్కని అసమ్మతి అభిప్రాయాలను డా॥ పి. సుబ్బరాయన్ ఆ నివేదికతో జతపరిచారు. ఇప్పుడు హింగీ వాదులు రెండోసారి ప్రయత్నంచేస్తున్నారు. ఖేర్ సంఘనివేదికను పరిశీలించి, రాష్ట్రపతికి సిఫార్సులు చేసేందుకు పార్లమెంటు ఉభయసభలూ ఒక సంఘాన్ని ఏర్పాటు చేశాయి. ఈ సంఘంలో ఎక్కువమందిని హిందీవాదులనే వేయాలని, వేసి దాక్షిణాత్యులమీద దెబ్బ తీయాలనీ ఇప్పుడు ప్రయత్నం. టాండన్ గారి బోనులో చిక్కుకోవడం దాక్షిణాత్యుల కిష్టంలేదు. ఆ సంఘంలో అన్ని రాష్ట్రాలకూ ప్రాతినిధ్యం ఉండాలని వారి వాదం. 1990దాకా హిందీని అధికారభాష చేయరాదని కూడా వీరు "ఏకగ్రీవంగా" ఒక మహజరు తయారుచేసి ప్రధానమంత్రికి సమర్పించారు. టాండన్ వర్గానికి సమాధానం చెప్పగలిగినంత మందిని తమ మనుషులను కూడా సంఘంలో వేయించాలని కూడా వీరి ప్రయత్నం. పార్లమెంటులో హిందీ ప్రతినిధులదే సంఖ్యాబలం కావచ్చు; వారి మాటే నెగవచ్చు. కాని వారు హిందీని దక్షిణాదివారిపై బలవంతాన రుద్దడం కష్టం. ఉత్తరాదిలోనే సిక్కులవంటి అల్పసంఖ్యాకుల మీదకూడా వారు హిందీని రుద్దలేకపోతున్నారు.

హిందీభాషావాదం రాజకీయ జ్ఞతతో కూడినదికాదు. అధికసంఖ్యాకుల భాషకదా అని హిందీని తమిళులమీద రుద్దితే, లంకలో స్థిరపడిన భారతీయులు సింహాళీ భాష తమకక్కర్లేదని ఏ మొహం పెట్టుకుని వాదించగలుగుతారు?

భారత దేశంలో యథార్థ పరిస్థితులను కప్పిపుచ్చి వాటినుంచి ప్రజల దృష్టిని మరల్చడానికే భాషా వివాదమనీ, మరోటనీ, తలాతోకాలేని వివాదాలు లేవదీస్తున్నారని ఇక్కడ ఒక అభిప్రాయం ఏర్పడింది. అధికార భాషాసంఘం నివేదికను ఏడాదిపైగా బీరువాలో పడేసి ఉంచి ఇప్పుడు పైకి తీశారు. కనీసం ఆహార క్లిష్టపరిస్థితి దాటినదాకానైనా దాన్ని అలాగే ఉంచి ఉండాల్సింది. అసలు న్యూఢిల్లీ నగరం చూస్తే దేశంలో ఆహార సమస్య ఉందనే సంగతి కూడా కనిపెట్టలేము. ఏసాయంత్రం చూసినా అరడజను చోట్ల విందులు జరుగుతూ ఉంటాయి. విందులూ, ఉత్సవాలు స్వతంత్ర భారతదేశానికి సహజ లక్షణాలైపోయినట్లు తోస్తుంది.

* * *

యూరప్‌లోను, ఆసియాలోని ఇతర దేశాల్లోనూ చాలాచోట్ల ఇంగ్లీషు అభ్యసనంపై అమితాసక్తి కనబడుతోంది. ఉదా

కారణంగా జపానులో విద్యార్థులు తమ ఇళ్ళకు దగ్గర్లో ఉన్న ఇంగ్లీషు వాళ్ళో, అమెరికన్ వాళ్ళో పట్టుకుని, ఇంగ్లీషులో మాట్లాడడం అలవాటు చేసుకుంటూ ఉంటారు. మన దేశంలో ఎలా వస్తేనేం, మొత్తానికి ఇంగ్లీషు భాష ఉపయోగంలోకి వచ్చింది. దాన్నిప్పుడు అక్కర్లేదని త్రోసివేయడం అవివేక మనిపించుకుంటుంది.

రాష్ట్రాల ముఖ్యమంత్రులకు ప్రధాన మంత్రి అప్పుడప్పుడు ఉత్తరాలు రాస్తూ ఉంటారు. అలాంటి ఉత్తరాలను "అతి రహస్యం" అనే ముద్ర వేసి కేంద్ర మంత్రులకూ, కేంద్ర ప్రభుత్వ కార్యదర్శులకూ కూడా అందజేస్తూ ఉంటారు. ఏడాదికిందట గావును ఒక వార్తాసంస్థ ఈ రహస్య ఉత్తరాల్ని ప్రచురింప నారంభించింది. కార్యదర్శులే వీటిని బయటపెట్టి ఉంటారని అప్పుడు అనుమానించారు. అందుచేత వారికి ఆ ఉత్తరాలు చూపించడం మానేశారు. అయినా అవి బయటపడుతూనే ఉన్నాయి. అంచేత మళ్ళీ వాటిని యథాప్రకారం కార్యదర్శులకు ఇవ్వ నారంభించారు.

మళ్ళీ కొన్ని వారాల క్రితం ఇలాంటి ఒక ఉత్తరంలోని రహస్యాలు కొస్తకొస్తే బయట పడసాగాయి. సాధారణంగా ఈ ఉత్తరాల్లో ప్రధానమంత్రి కొత్తగా ఇచ్చిన ఉపన్యాసాల్లోని ముఖ్య విషయాలే ఉంటాయి. వీటిలో ఇంగ్లీషు నిర్దుష్టంగా, సాజూగ్గా చాలా బావుంటుంది. ఈ మధ్య ప్రమాణాలు తగ్గిపోతున్నాయని ఆందోళన పడుతున్నారు గదా! ఈ ఉత్తరాల్ని ప్రకటిస్తే, వాటిని చూసైనా ఇంగ్లీషు బాగా నేర్చుకోవాలనే ఉత్సాహం కొందరికి కలుగుతుంది. ఆ విధంగా అవి ఉపయోగపడినట్లవుతాయి.

* * *

ఉన్న అవకాశాలు కొద్దీ, మనుషు లెక్కువా అయినప్పుడు, వాటిని పంచడం ఒక లలితకళ. స్వాతంత్ర్యానికి పూర్వం వాటిని ఒక రకంగా పంచేవారు: జెండా ఎగరెయ్యడం ఒకరివంతు, సమావేశం ప్రారంభించడం మరొకరి వంతు, సభికుల నాహ్వానించడం ఒకరివంతు, అధ్యక్షోపన్యాసం మరొకరివంతు, వందన సమర్పణం ఇంకొకరివంతు, ఇలాగ. ఈ ఆచారం ఇప్పటికీ కొనసాగుతూనే ఉంది. భారతదేశంలో పన్నుల విధానం అతి విచిత్రమైనది. ఈ విచిత్ర విధానంవల్ల కలిగే లాభాలను పంచిపెట్టడంలో ఆ పూర్వపు ఆచారం కనిపిస్తూనే ఉంది.

ఢిల్లీలో ఇదివరకటి రాజకీయవ్యవస్థలో అధికార హోదాలో ఉన్న వారందరికీ పార్లమెంటు సభ్యత్వమిచ్చి ఆదుకోవడం సాధ్యం కాకపోయింది. అందుచేత వారిలో ఇద్దరికి ప్రత్యేకంగా ఉద్యోగాలు సృష్టించి ఇచ్చారు. వీరు ఎవరికీ బాధ్యత వహించకుండానే పని సాగిస్తున్నారు. ఇప్పుడు మరో ఉద్యోగం సృష్టించారు. విద్యార్థులలో క్రమశిక్షణ పెంపొందించే విషయమై కేంద్ర విద్యాశాఖకు సలహాఇవ్వడం ఈ కొత్తఉద్యోగం తాలూకు పని. ఈ పని చేసే సలహాదారుకు నెలకు రూ. 2,250/-జీతం. విద్యాశాఖకు ఈ ఉద్యోగం సృష్టించడం ఇష్టంలేదట. అయినా వారి మాట ఎవరూ వినలేదట.

పునరావాస శాఖలో డిప్యూటీమంత్రిగా పనిచేసిన జనరల్ భోస్లేకు ఈ ఉద్యోగమిచ్చారు.

పనిలో పనిగా వ్యయకర్తన ఉద్యమం సాగిపోతూనే ఉంది. అభివృద్ధికి పనికిరాని ఖర్చంతా తగ్గించాలని ఉపన్యాసాలిస్తూనే ఉన్నారు. జరిగిన పొదుపు ఏమిటంటే ఖాళీగా ఉన్న కొన్ని ఉద్యోగాల్లోకి కొత్తగా ఇంకా ఎవర్నీ వేయకపోవడం.

* * *

శ్రీ ఫిరోజ్ గాంధీ మంచి సమర్థుడని అందరిచేతా అనిపించుకున్నారు. ఇటీవల ఆయన రైల్వేశాఖ బండారమంతా బయటపెట్టి తమ సామర్థ్యం నిరూపించుకున్నారు. తన ఉద్యోగులు తనకు సరిగా అన్ని వివ

(55-వ పేజీ చూడండి)

# వివాహ మహోత్సవం

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారి దౌహిత్రి, ఆంధ్రపత్రిక సంపాదకులు శ్రీ శివలెంక శంభుప్రసాద్ గారి జ్యేష్ఠపుత్రీ అయిన చి॥ సౌ॥ లీలాభ్రమరను, చి॥ సీతారామారావుకు (శ్రీ॥ శే॥ దిగవల్లి వెంకట సుబ్బారావుగారి కుమారుడు) ఇచ్చి మద్రాసు, అన్నామలైనగర్ లోని కన్యాదాత స్వగృహంలో ఈనెల 2వ తేదీ ఉదయం 9-20కి వివాహమహోత్సవం జరిగింది

వధువు ఏం ఏ పట్టభద్రురాలు, వరుడు ఇంజనీరు

బంధు మిత్రులు, పుర ప్రముఖులు, మద్రాసు గవర్నరు దంపతులు, మంత్రులు హాజరై వధూవరులను ఆశీర్వదించారు

వధూవరులను ఆశీర్వదిస్తూ రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్, కేంద్ర మంత్రులు శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి, శ్రీ టి టి కృష్ణమాచారి, మధ్యప్రదేశ్ మాజీ గవర్నర్ డా॥ పట్టాభి సీతారామయ్యగారు, ఇతర



వధూవరులు
సౌ॥ లీలాభ్రమర చి॥ సీతారామారావు



పెళ్ళికి వచ్చిన పెద్దలు
మద్రాసు గవర్నరు దంపతులు, మంత్రులు శ్రీ సుబ్రహ్మణ్యం, భక్తవత్సలం, ఆంధ్ర విద్యామంత్రి శ్రీ కళా వెంకటరావు, శ్రీ కల్లూరి చంద్రమౌళి ప్రభృతులు వేదికవద్ద ఆసీనులై వున్నారు

ప్రముఖులు శుభసందేశాలు పంపించారు.

నాటిసాయంత్రం అతిథులకు సత్కారం జరిగింది. శ్రీ ద్వారం వెంకటస్వామినాయుడు రెండుగంటలసేపు వయొలిన్ కచ్చేరీచేసి అతిథులను ఆనందపరవశులను చేశారు. నాయుడు గారికి శంభుప్రసాద్ గారు నూతన వస్త్రములిచ్చి సన్మానించారు.

౮ వ తేదీ సాయంత్రం విందు జరిగింది.

వివాహమహోత్సవానికి మద్రాసు గవర్నరు శ్రీ జాన్, వారిసతీ, ముఖ్యమంత్రి శ్రీ కామరాజ్, హోంమంత్రి శ్రీ భక్తవత్సలం, విద్యామంత్రి శ్రీ సుబ్రహ్మణ్యం, ఆంధ్ర రివిన్యూ మంత్రి శ్రీ కళా వెంకటరావు, మద్రాసు మేయర్ శ్రీ శ్రీనివాసన్, 'హిందూ' సంపాదకుడు శ్రీ కె. శ్రీనివాసన్, చల్లపల్లి రాజా శ్రీ శివరామప్రసాద్, వాహినీ స్టూడియో యజమానులు శ్రీ నాగిరెడ్డి, శ్రీ చక్రపాణి, ఆంధ్ర మాజీమంత్రులు శ్రీ గౌతు లచ్చన్న, శ్రీ కల్లూరి చంద్రమౌళి, 'స్వరాజ్య' సంపాదకుడు శ్రీ ఖాసా సుబ్బారావు, శ్రీయుతులు పర్వతనేని బ్రహ్మయ్య, డి. ఎస్. శాస్త్రి



విజయా నిర్మాతలు శ్రీ నాగిరెడ్డికి, శ్రీ చక్రపాణికీ స్వాగతం చెపుతున్న శ్రీ శంభుప్రసాద్.

శ్రీయుతులు పర్వతనేని బ్రహ్మయ్య, కళా వెంకటరావు, చంద్రమౌళి, చల్లపల్లి రాజా శివరామప్రసాద్ ప్రభృతులు



మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కామరాజ్, విద్యామంత్రి శ్రీ సుబ్రహ్మణ్యం ప్రభృతులలో శ్రీ శంభుప్రసాద్

# వివాహ మహోత్సవం

(సెంట్రల్ బ్యాంక్), కె గోపాలరావు (బరోడా బ్యాంక్), భోగరాజు వెంకటరత్నం (భారతలక్ష్మి బ్యాంక్), జె వి సోమయాజులు, వాడ్రేవు జగ్గరాజు, ఎస్ పూర్ణచంద్రరావు, కల్నల్ శాస్త్రి, నూకల వీరరాఘవయ్య, వి జి ఎస్ వి ప్రసాద్, కొత్తా సత్యనారాయణ చౌదరి, పి సూర్యనారాయణ, డా॥ పి తిరుమలరావు, డా॥ గోవిందరాజు సుబ్బారావు, డా॥ గాలి బాలసుందరరావు, డా॥ వెంకయ్య, శ్రీనివాస శిరోమణి, మొక్కపాటి నరసింహశాస్త్రి, జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి, క్రొవ్విడి లింగరాజు, న్యాపతి రామారావు, పి వి శివరామకృష్ణయ్య (అఫిషియల్ అస్సైనీ), కామరాజు కృష్ణమూర్తి (అడ్వొకేట్), టి సదాశివమ్ (కలికి), బుర్రా సుబ్రహ్మణ్యం (అడ్వకేట్), కె చంద్రశేఖరన్ (అడ్వకేట్), కె బాలసుబ్రహ్మణ్య అయ్యర్ (అడ్వకేట్), ఆమంచర్ల గోపాలరావు, అన్నాప్రగడ కామేశ్వరరావు, బొంబాయి వర్తక ప్రముఖులు వ్రజలాల్ హీరాలాల్, బొంబాయి జర్నలిస్టు ఓ ఎన్ వర్మ, ఇంకా పలువురు బంధుమిత్రులు హాజరై చందన తాంబూలాలు స్వీకరించి వధూవరుల నాశీర్వదించారు శ్రీ శ్రీరంగం నారాయణబాబు వధూవరుల నాశీర్వదిస్తూ పద్యాలు చదివారు అతిథులకు శ్రీ శంభుప్రసాద్ గారి కుమారుడు శ్రీ రాధాకృష్ణ చందన పుష్పములతో స్వాగతము చెప్పారు

అతిథి సత్కారానికి శ్రీయుతులు యార్లగడ్డ శివరామప్రసాద్, మద్రాసు ఎగువసభ అధ్యక్షుడు డా॥ పి వి చెరియన్, శ్రీమతి తారాచెరియన్, జీవిత భీమాసంస్థ దక్షిణ మండలం మేనేజరు బాలసుబ్రహ్మణ్యం, నార్ల వెంకటేశ్వరరావు, భగవాన్ దాస్ గోయెంకా, నీలంరాజు వెంకటశేషయ్య, ఈసన్ ఇంజనీరింగ్ కంపెనీ మేనేజరు లాంబర్డు, మెటల్ బాక్స్ కంపెనీ మేనేజరు అల్గార్, సేల్సు మేనేజరు సి హెచ్ ఎస్ రావు, దాదా ఎండ్ కంపెనీ యజమాని దాదా, న్యా॥ పంచాపకేశయ్యర్, నేషనల్ ఇంజనీరింగ్ కంపెనీ యజమాని ప్రసాద్, రామకృష్ణ సంస్థల ప్రతినిధి రాఘవరావు, కీమర్ కంపెనీ ప్రతినిధి పి ఎస్ జి రావు, గ్రాండ్ అడ్వర్టయిజింగ్ కంపెనీ ప్రతినిధి టి కె మీనన్, చెరుకూరి పూర్ణచంద్రరావు, 'హిందూ' సహాయసంపాదకుడు వి కె నరసింహన్, జి నరహరి, సముద్రాల రాఘవాచార్యులు, జి వెంకటాచలతి, జాక్ డికిన్సన్ కంపెనీ ప్రతినిధి గాస్కెల్, శ్రీమతి గాస్కెల్, ఛార్లెస్ మార్గన్ కంపెనీ ప్రతినిధి మిచల్, నిమ్మగడ్డ వెంకటకృష్ణయ్య, ఆంధ్రరివిన్యూమంత్రి కళా వెంకటరావు, మద్రాసు పోర్టుట్రస్టు చైర్మన్ జి వెంకటేశ్వరన్, పి వి రామారావుగుప్త, తదితర మిత్రులు, బంధువులు హాజరైనారు ★

రావు తెలిసిందా!"

అనుమానం రానేవచ్చింది గోపికి. మళ్ళా అన్నాడు ము-ర-ళీ-ధ-ర-రా-వు. "అది తెలిసింది. ఏడక్షరాలకోసం పేరు మార్చుకున్నాడన్నమాట మా బావ" అన్నాడు ఎగిరి బెంచీ మీదనుంచి క్రిందకు దూకుతూ.

"ఏడచ్చరాలేంటి బాబు?" అనడిగాడు కనుబొమ్మలు ముడుస్తూ జవాను రామయ్య.

"అదంతా నీకెందుకులేగాని, బావ పండగనాటికొస్తానని వుత్తరం వ్రాశాడు" అంటూ రామయ్యను తృప్తిపరిచాడు గోపి.

బండి ప్లాట్‌ఫారంమీదకు వచ్చి నిలిచింది. గోపికి ఎప్పుడెప్పుడు అక్కయ్యను చూద్దామా అనిపించింది. ఇంజను దగ్గరనుంచి ఒక్కొక్క పెట్టె చూచుకుంటూ జవానూ గోపీ బయలుదేరారు.

"అదుగో అక్కయ్య, అరె! బావకూడా వచ్చాడే" అంటూ పరుగుతీశాడు గోపి.

రామయ్య భుజంమీదనున్న తుండుతీసి తలకు చుట్టుకొంటూ అక్కడకు చేరాడు.

"ఏం బావా! పండగనాటికొస్తానని అప్పుడే వచ్చావే!" పరామర్శించాడు గోపి.

"తప్పు గోపీ! బావగార్ని అలా అడగకూడదు" సర్దుబాటు చేయ చూచింది సుశీల.

"ఆ సామాను నాకు ఎత్తండి బాబు! బండికాడికి తీసుకొస్తా" అంటూ పెట్టెల దగ్గర కొచ్చాడు జవాను రామయ్య.

రామయ్య ముందు, అతని వెనుక గోపి, తర్వాత మురళీధరరావు, అతని వెనుకనే సుశీలా గుర్రంబండి దగ్గర కొచ్చారు.

"ఏమయ్యా. గవర్నరుపేట కొస్తావా?" అని రామయ్య అడిగాడు బండివాడిని.

"ఎంతమంది బాబు?"

"నలుగురు, రెండు పెట్టెలున్నాయి.

"బేరం లేకుండా చెప్పుతున్నాను. ఎనిమిదణాలు ఇప్పించండి బాబు"

"ఎనిమిదేమిటయ్యా ఎనిమిది! అష్టకష్టాలు పడటానికా నీ బండిలో కూర్చుని? ఏడణాలు ఇస్తాం. వస్తేరా—లేకపోతే మరొకబండి చూచుకుంటాం" అంటూ గోపి బావ వైపు చూశాడు.

ఈ బేరం బావకు నచ్చినట్లే కనిపించటం వల్ల గోపికి మరీ ఉత్సాహం ఎక్కువైంది.

"అణాదగ్గర బేరమా బాబు? అర్ధరూపాయి డబ్బులైనా లేంది రాను బాబు" అంటూ వాడు మరొక బేరంకోసం ప్రక్కకు పోయాడు.

"పోనీలేండి, అర్ధరూపాయి భాగ్యం. యిద్దాం పిలవండి వాడిని" అంది సుశీల మురళీధర రావుతో.

అర్ధరూపాయి యిద్దాం, అనే నిశ్చయానికి మురళీధరరావు వచ్చేటప్పటికి మరొక బండివాడు "ఎక్కడికి బాబు? నా బండి ఎక్కండి, జల్దీ తీసుకపోతా" అంటూ దగ్గరకు బండితో సహా వచ్చాడు.

"గవర్నరుపేటకు వెళ్ళాలి. ఎంత ఇవ్వమంటావ్?" ఈ దఫా మురళీధరరావే బేరం చేశాడు.

"గవర్నరుపేటకు బేరం ఏంటి బాబు. మీరు మామూలుగా ఇచ్చేంతే యియ్యండి" అంటూనే రెండు పెట్టెలు బండిలో పెట్టేశాడు.

"ఎక్కండి బాబు...మీరు చదువుకున్నోరు. మీలాంటి మారాజుల్తో బేరాలేటి బాబు" అంటూ గుర్రం కళ్ళెం పుచ్చుకొని బండిని రోడ్డువైపుకు త్రిప్పుకున్నాడు.

నలుగురూ బండెక్కారు. జవాను రామయ్య బండివాని ప్రక్కగా ముందు కూర్చున్నాడు. మధ్యగోపి కూర్చున్నాడు. బావతో ఏమేమో మాట్లాడాలని, ఏడంకె చెప్పి ఏడిపించాలనే వూహలతో మునిగిపోయాడు.

"ఏం గోపీ. ఈ ఏడు ఏ క్లాసులో చేరావ్?" పరామర్శించాడు చిన్నిబావ మరదిని పెద్ద బావగారు.

"ఆ...నేనా..." కొస్త తెప్పరిల్లాడు గోపి.

"నేను సెకండ్ ఫారం...ఆహా తప్పు తప్పు...ఏడవ తరగతిలో చేరాను బావా" అంటూ నవ్వాడు గోపి.

"సుశీ! నీతమ్ముడు చాలా చిలిపివాడు సుమా" అంటూ గోపి బుగ్గమీద చిన్న చిటికె వేస్తూ సుశీలవైపు చూచాడు మురళీధరరావు. ఆ మాట యీ సమయంలో ఎందుకంటున్నారో అర్థంకాక సుశీల గోపివైపు చూచింది.

"టక్" మని బండి ఆగింది. అందరూ ఒకరిపై ఒకరు తూలారు. వెనుకనుంచి మురళీధరరావు, ముందునుంచి బండివాడు ఒక్కసారి క్రిందకు దిగారు.

"మీరెక్కండి బాబూ ఏమీ లేదు... చెవులోంచి బీడి క్రిందపడ్డది. అందుకని ఆపాను" అంటూ గుర్రం కాళ్ళమధ్య బీడీని తీసి బండి ఎక్కాడు బండివాడు.

"ఏం ప్రమాదమొచ్చిందా" అని దిగిన మురళీధరరావు ఒక పెద్ద శ్వాసతీసి బండెక్కాడు.

"భయపడ్డావా బావా......ఈ వూళ్ళో బండ్లు ఇంతేలే..." అంటూ పొట్ట పగిలేలా నవ్వాడు గోపి.

బండి యింటిముందాగింది. కూతురు కోసం ఎదురుచూస్తున్న సీతమ్మగారు అల్లుడుకూడ రావటం గమనించి సంతోషంగా ఎదురువచ్చింది.

"ఏమ్మా, బండి ఆలస్యమా! ఇంట్లోకి వెళ్ళి నీవు కాళ్ళు కడుక్కొని, మీ ఆయనకు నీళ్ళు తీసుకొని రా" అంటూ కూతుర్ని ఇంట్లోకి తీసుకొని పోతూ గోపికోసం బండివైపు చూచింది సీతమ్మగారు.

"అదేంటి బాబుగోరు...నేనేం ఎక్కువడిగానా...నాయింగానె అడిగాను. నలుగురికి నాలుగు బేడడబ్బులు, సామానుకి ఒక బేడ...ఇంతేగంద బాబు. మీలాంటి చదువుకొన్న మా రాజులే బేరంచేస్తే, మేమెలా బతకాలి బాబు? గడ్డిమూట మూడురూపాయలమ్ముతుందాది" అంటూ పది అణాలు ఇచ్చిందాకా కదలనంటున్నాడు బండివాడు.

మురళీధరరావు చుట్టుపట్ల ఒకసారి చూశాడు. అసలే అత్తారింటికి రావటం అది కొత్త. పైగా అత్తవారింటి ముందు బండివాడితో బేరం. ఒకసారి ఇంటివైపు చూచాడు. అత్తగారు తమవైపే చూస్తూ వుండటంతో సగంప్రాణం పోయింది మురళీధరరావుకు.

"నే చెప్పలే బావా! యీవూళ్ళో బండివాళ్ళతో ముందుగా బేరం చేయందే ఎక్కకూడదని" తాను మాట్లాడలేదు కదా అనే ధీమాతో అన్నాడు గోపి.

అన్నాడే కాని, గోపికికూడా పది అణాలివ్వటం ఇష్టంలేదు. ఐతే తానేం చేస్తాడు బావ మాట్లాడిన బేరానికి.

"ఇదుగో అబ్బాయ్. ముందు బాడుగ మాట్లాడుకోక పోవడం నీ తప్పు. అయినా గొడవెందుకు గాని తొమ్మిదణాలు తీసుకో" అంటూ పర్సుతీసి చిల్లరకోసం చూచాడు మురళీధరరావు.

"చిల్లర లేదా బావా...రూపాయి ఇవ్వు. ఏడణాలు ఇస్తాడు." అన్నాడు గోపి, ఈ ఏడంకె బావతోనే వచ్చిందా! అని నవ్వుకొంటూ.

ఈ సలహా మురళీధరరావుకు నచ్చింది. ఏడు అణాలు లెఖపెట్టి బండివాడివ్వటం, పర్సులో వేసుకోవడం క్షణంలో జరిగిపోయింది.

ఈ గొడవంతా జవాను రామయ్యద్వారా విన్న సుశీల "బేరం కుదిరిందా?" అంది చెంబుతో నీళ్ళందిస్తూ.

"ఆహా! ఇదంతా నీ తమ్ముడి బేరం. మొదటే బేరం ఆడకుండా వుంటే అర్ధరూపాయ ఇచ్చి వుందును" అన్నాడు నీళ్లు అందుకుంటూ.

# ఏడంకెల బావ

"చాల్లెద్దురా అంతా బడాయిలూ" అంటూ నవ్వింది సుశీ.

ఇంతలోకే రామనాథంగారు ఒక రిక్షా నిండా సామానులతో యింటిముందు దిగారు. కాళ్ళుకడుక్కొంటున్న అల్లుణ్ణి చూచి కొద్దిగా ఆశ్చర్యపడ్డా, అమ్మాయి, అల్లుడు ఒకేదఫా వచ్చినందుకు సంతోషించాడు.

"మీ నాన్న, అమ్మ కులాసాగా వున్నారా?"

"ఆ! కులాసేనండి."

"మీరు పండగనాటి కొస్తానని వ్రాశారు. "కాదు. మీరు కూడా అమ్మాయితో నే రాండి." అని వ్రాద్దామను కొన్నాను. అయితే టైంఏది. ఎల్లుండే నాయె పండగ" అంటూ "గోపీ! లోపలకెళ్ళి, బావకు కాఫీ తీసుకరా" అన్నారు రామనాథం గారు.

"నేతెస్తే బావ తాగరేమో నాన్నారూ అక్కయ్య వుందిగా" అంటూ బావవైపు చూచాడు గోపి.

"గోపి చాలా మాటకారైనాడు సుమండీ" అంటూ మురళీధరరావు మామగారి వైపు చూసి నవ్వాడు.

"వీడితో వేగలేకుండా వున్నానండి. మీవూరు తీసుకొనిపోయి కాస్త భయం చెప్పండి"

"నాన్నారూ! నేను ఆ ఏడతురాల వూరికి వెళ్ళనండి. పైగా నేను కూడా పేరు మార్చుకోవాలేమో" అంటూ లోపలికి పరిగెత్తాడు గోపి.

రామనాథంగారు అల్లుడితో ఏదో చెప్పే లోగా సుశీల రెండు గ్లాసులతో కాఫీ తెచ్చియిచ్చింది. ఇద్దరూ కాఫీ అందుకున్నారు.

"చూడమ్మాయ్. గోపికి కాస్త భయం చెప్పమని మీ అమ్మతో చెప్పు. మరీ వీడికి పరాశకా లెక్కువయ్యాయ్ వాళ్ళ బావతో"

"అదేంటి నాన్నా! వాళ్ళ బావతో పరాశకా లాడకపోతే వాడింకెవ్వరితో పరాశకాలాడతాడు?" అంటూ మురళీధరరావును చూచి చిరునవ్వు నవ్వింది.

"అహా! ఇంతధైర్యం ఎప్పుడొచ్చింది? పుట్టింటి మహత్యంగామోలు" అనుకుంటూ క్రీగంటి చూపు చూచాడు మురళీధరరావు.

ఆ రాత్రి భోజనాల సమయంలో "ఎన్నాళ్లు సెలవు పెట్టారు" అనడిగారు రామనాథంగారు.

"పదిరోజులు శెలవియ్యమని అడిగానండి. పని చాలా ఎక్కువగా వుంది. పైగా ఇన్స్పెక్షన్ రోజులు. వారంరోజులు శెలవు గ్రాంటు చేయించుకోవడానికి బ్రహ్మప్రళయమైంది" అన్నాడు మురళీధరరావు.

"అంటే ఏడురోజులు శెలవిచ్చారన్నమాట!" అందుకున్నాడు గోపి. నవ్వుకున్నారు రామనాథం, మురళీధరరావు.

మర్నాడే పండగ. బడినుంచి వచ్చిన గోపి, పుస్తకాలను పరుపుమీద విసరివేస్తూ, కుర్చీలో కూర్చున్న బావనుచూచి "ఇవ్వాళ్ళ క్లాసులో ఒక గమ్మత్తు జరిగింది బావా" అన్నాడు.

"ఏమిటో విశేషం?" చిన్నబావ మరదితో చెలగాటం కూడదనుకున్నా తీరా మాట్లాడక పోతే "మూగబావ" అంటాడేమోనని మాటల్లోకి దిగాడు మురళీధరరావు.

"అదే బావా. మరే మా స్నేహితుడేమో ఏడంకె "అంకెల్లో కెల్లా చెడ్డది" అన్నాడు. నేనేమో "మంచిది" అని వాదించిగెల్చాను.

"ఎలా చెప్పు?" అన్నాడు వాడు.

"చూడు ఏడు కొండలస్వామిలో ఎంత మహత్యం వుందో, మన ఋషులంతా ముక్తికి ఏడేళ్ళు తపస్సు చేసేవారూ, పైగా మనకు వారానికి రోజులు కూడా ఏడే" అన్నాను. అయినా వాడు ఒప్పుకోలేదు. మేము మా మాష్టార్ని అడిగాము. ఆయనా నన్ను సపోర్టు చేశాడు బావా! చూడండబ్బాయిలూ ఏడు మంచి అంకే సప్తఋషులు, సప్తసముద్రాలు, సప్తస్వరాలు అంటూ ఎన్నో చెప్పారు బావా. అప్పుడేమో నేను అవును మాష్టారూ. మా నాన్నమ్మ చిన్నప్పుడు "అనగనగా ఒక రాజు, ఆ రాజుకు ఏడుగురు కొడుకులు...అని చెప్పేది అన్నాను. అంతా నవ్వారు బావా."

మురళీధరరావుకు నవ్వాగలేదు, నవ్వాడు. కాని వెంటనే గోపి ఇలా కల్పించలేదు కదా! అనే సందేహం వచ్చేటప్పటికి ఆ నవ్వు మాయమైంది.

గోపిని అమ్మ పిలిచింది. బావకు కొద్దిగా మనశ్శాంతి కలిగింది,

వినాయక చవితి రోజున రామనాథం గారు, మురళీధరరావు, గోపి, వినాయకునికి పూజచేస్తున్నారు. పౌరోహితుడు వినాయక చవితి మహత్యం కథచెప్పి, పూజలన్నీ పూర్తి అయిన తర్వాత గోపిని వినాయకుని ముందు నిల్చొని మూడు గుంజెళ్ళు తియ్యమన్నాడు:

"నేనేనా! బావ కూడా నాండి?" అన్నాడు గోపి.

"తప్పు బాబూ, పెద్దవారి నలా అంటే

(56-వ పేజీ చూడండి)

చలచిత్ర కథలు

# విక్రమార్కుడి మార్కు సింహాసనం

వరహాలరాజు ఆయొక్క భద్రగిరి దరిచేరే వరకు ఒక విచిత్రమైన సన్నివేశం దృగ్గోచరమైంది.

ఒక కారు గేటు ఇవతల హఠాత్తుగా హైరాయింపుసమ్మె చేసినట్లు ఆగిపోయింది. బహుశా డ్రైవరుకి జీతం అందలేదు కాబోలు, అందుకని ఇది సింపతటిక్ లేక సానుభూతి సమ్మె అని చూపరి దురభిప్రాయపడవచ్చు. కాని అది సత్యదూరము. దాదాపు ఆమడ దూరము. సత్యం చాలా మంచివాడు. సత్యం అంటే ఆ కారులో ప్రొడ్యూసరు. మంచివాడు. జీతాలు బకాయి పెటడు. అయితే కారు ఆగిన కారణం యేమిటి? ఇందాక దురభిప్రాయపడిన చూపరి ఇంకో క్షణం ఆగిచూస్తే, స్వామిభక్తివల్లనే అని చటుక్కున గ్రహించేసేవాడు.

ఎందుకంటే ఆ స్వామి ఆనందంతో ఉబ్బి లావుగా అయిపోయాడు. కారు కూడా ఆ ఆనందం కాస్త పుచ్చుగుని బరువెక్కి ఉక్కిరిబిక్కిరై ఆగిపోయింది. సరే అందుకని అందులోని లావుపాటి సత్యం ఇంక ఉండబట్టలేక ఇవతలికి ఊడిపోయాడు. ఆపైన, ఆనందంతో, వినాయకచవితిలో బొజ్జపాటి కృష్ణారావులా మనోహరంగా విలాసంగా చిందులుతొక్కుతూ అలా కాలినడకనే స్టుడియోలోకి వెళ్ళిపోతున్నాడు. గేటు దాటుతూవుండగా ఎదురుగా ఇంకో కారు వచ్చింది.

అందులో ఆయన ఈ ఆనంద నృత్యం చూసి ఏమిటి గిరాకీ అన్నాడు.

'కుడుతుటాంగో బా... కుడుతుటాంగ. రెండుపేరుం ఒకే అడి కాల్‌షీట్ కుడుతుటాంగ. ఇది ముడించిదన్నా వేరెన్నదా వోణుం.. అడ మురుహా, ఎణ్ణా చ్చొల్లిదణ్ణే. అంద పయలెకి పె బీడీవాంగి పుడిచేంబార్.....అవ్వళవ్వ త్తా.....ఒకే అడ్డియా రెండుపేరుం, 'సర్దా సార్ ఇన్నికి ఒ ం నంబ సెట్ లెత్తాన్ వేలెపణ్ణువో(...అదుకణ్ణె..,అబ్డీను టాంగ...అడ! యన్నాల నంబవే ముడీలెణ్ణాకా...కణ్ణే యూరుకుం చొల్లాదె...మనదిలె వెచ్చిక్కో... అంద గోంఖురా పయ్యనాలె త్తాన్ ఇవ్వళవు అదిష్టం." అంటూ ఉభయభాషాప్రవీణ లావుపాటి సత్యం ఉహు మురిసిపోతూ పల్లవికి ముక్తాయింపు డాన్సు పూర్తిచేసి రెండో చరణం ఆరంభిస్తూ, అలా అలా తోకలేక తూకం చెడ్డ గాలిపడగలా పల్టీలు కొట్టబోయి తమాయించుకుంటూ, 'తెర వేలుపుల విహార సీమయగు చలనచిత్ర స్వర్గసీమలోకి' సాక్షిగా ఫెడౌట్ అయిపోయాడు.

## ఎస్. పార్థసారథి

కారులో కూర్చున్న రెండో ఆయన తక్షణం కారుదిగి, గేటుదగ్గర నిల్చున్న ఒక నవయువకుడిని ఆప్యాయంగా పలకరించి ఆ బీడీ నాకిచ్చేద్దూ బాబ్బాబూ అన్నాడు

ముట్టించబోతున్న బీడీ అపశకునంగా తీసేసి బిక్కమొహంపెట్టి ఒక్కసారి నాకి ఇచ్చేశాడు ఆ యువకుడు.

ఉత్త్వ సంధి చేసి మాట్లాడినందుకు స్వగతంలో చెంపలేసుకుని, ప్రకాశంగా నోరుమూసుకుని కారులో దూరి తుర్రుమన్నాడు ఆ పెద్ద మనిషి.

బీడీ యిచ్చిన యువకుడు ఉస్సురని నిట్టూర్చి గోడకు చేరగిలబడ్డాడు.

* * *

ఈ దృశ్యం చూచిన వరహాలరాజు విస్మయచకితుడైపోయి, దగ్గరసావెళ్ళి 'సార్' అన్నాడు.

"ఇంక లేవండి" అన్నాడు ఆయువకుడు.

"అది కాదుసార్" అన్నాడు రాజు.

"రూపాయలు అసలే లేవండి. బీడీలే అయిపోత' అన్నాడు ఆయువకుడు విసుగ్గా.

"అదీ కాదుసార్. ఇందాకా ఆ లావుపాటి ఆయన ఎందుకు డాన్సు చేశాడు! ఈ కారువాడితో ఆయన చెప్పిందేమిటి? ఈయనకి ఇంత పెద్ద కారూ బొల్డు డబ్బూ ఉంది గదా మిమ్మల్నిలా పీడించి బీడీ లాక్కోవడం ఎందుచేత? ఇదంతా పెద్ద మిష్టరీగా ఉంది. విప్పగొట్టరూ?" అన్నాడు.

ఆ యువకుడు రాజువంక తేరిపార చూచాడు మీరు ప్రొడ్యూసరు కాదుకదా? అయినా నన్నేం అడగరు గదా?... జేబులో ఒకటే బటాణీ ఉంది. కాస్సేపుండి మధ్యాహ్నం లంచిగా తిందా మనుకుంటున్నాను. అది ఇవ్వమనరు గదా?" అన్నాడు.

"నేను ప్రొడ్యూసర్ని కాదండి. హీరో అవుదామనుకుంటున్నాను ఇప్పటికి. నాపేరు రాజా" అన్నాడు రాజు.

"నాపేరు బాబు, నాది పెద్దకథ. కదిలిస్తే కథ చెప్పేడు చూశావా లోకువ కట్టి అని తిట్టుకోనంటే నాకథ చెబుతా. అది వింటే మీ మిష్టరీ విచ్చిపోతుంది. బైదిబై మీరు డిటెక్టివ్ నవల్సు రాసేవాళ్లు కారుగదా?"

"కాను" అని ఒట్టుపెట్టి అరచేయి గిల్లాడు రాజు.

"అయితే పదండి నాకథ చెబుతా. ఇక్కడికి దగ్గరలోనే టీకొట్టులో కూర్చుందాం. టీ తాగక్కర్లేదు లెండి. ఊరికే కూర్చోనిస్తాడు. నేను కూర్చుంటేచాలు వాడికి రోజుకి లక్షరూపాయల వ్యాపారం జరుగుతుంది" అన్నాడు బాబు.

"ఆ! అలాగా" అని ఆశ్చర్య పడబోయాడు రాజు.

బాబు అతన్ని గబుక్కున పట్టుకున్నాడు పడకుండా. "అలాటి పిచ్చి పనులు చేస్తే చెప్పను" అంటూ.

ఇద్దరూ కొంతదూరంవెళ్ళి స్థిమితంగా

టీ కొట్టులో కూర్చున్నాక, రాజే వద్దన్నా వినకుండా రెండు అరలు తెమ్మన్నాడు.

## కలియుగ కుబేరుడి కథ

"నేను పూర్వజన్మంలో కుబేరుణ్ణి" అన్నాడు బాబు టీ కొస్త చప్పరించి. ఇంకోక్షణం ఆగి లొట్టవేసి, ఆలోచించి, 'టు' అన్నాడు గ్లాసుని పక్కన బల్లమీద పెట్టి.

"ఓహో" అన్నాడు రాజు అందులో ఆశ్చర్యంలేదన్న భావాన్ని కాయకష్టులా నటిస్తూ.

"ఎందుకు మీరు ఆశ్చర్యపడలేదు?" అన్నాడు బాబు.

"అంతా చెత్తగా ఉందండి" అన్నాడు రాజు నేలవేపు చూస్తూ.

"అదీ సంగతి. పూర్వం నేను కుబేరుణ్ణిట. దరిమిలా ఇలా పుట్టాను. పూర్వజన్మంలో అలవాటుమూలాని ఈ జన్మంలోకూడా దేశే వాళీరకం కుబేరుడిని కావాలని బుద్ధిపుట్టింది. ఒరిజనల్‌గా ఆస్తి కొంత ఉందనుకోండి. బెంగుళూరు రేసుకోర్సులో చాలవరకు ఒలికిపోయింది. సరే సినిమా తీద్దాం అని వచ్చాను.

మా మావయ్యకి ఇది గిట్టలేదు. ఒద్దు సుమీ అన్నాడు.

సినిమాలు తియ్యనులే, ఊరికే పాటలూ అవీ రాస్తానూ, మహాఅయితే డైరెక్షను చెయ్యడంలాంటి పనులే చేస్తానూ అని చెప్పి ఈవూరు వచ్చేసి, కంపెనీ పెట్టేశాను. ఇంకా యేమీ మొదలెట్టకుండానే దురదృష్టదేవత నా కంపెనీలో షేరు కొని తినెయ్యడం మొదలెట్టింది. మా మావయ్య యిలా చెప్పి లాభంలేదని మారువేషం వేసుకుని ఈ వూరొచ్చి ఎవరితోనో మాట్లాడాడు నన్ను ఇంటికి మళ్ళించడం ఎలాగా అని.

వాడు వెయ్యినూట పదహార్లు ఫీజు పుచ్చుకుని, "నే చూస్తానుగా సినిమా ఎలా తీస్తావో" అన్నాడు. ఆనక వాడేం మంత్రం వేశాడో నాకు తెలీదు కాని, నేను ఒరిజినల్‌గా పూర్వం కుబేరుడినని పుకారు పుట్టేసింది. నిజమే కాబోసుసురి. అందరూ నమ్మేస్తున్నారు. పూర్వజన్మంలో బంగారం పట్టి పట్టి బాగా సాధ్యసైపోయినందువల్ల ఇపుడు పట్టిందల్లా బంగారం అవుతోందిట. కాని అది నా కోసం అయితే మాత్రం పనిచెయ్యదుట. ఇప్పటిగొప్ప ప్రొడ్యూసర్లందరూ నా దగ్గర అప్పులు పుచ్చుకున్నారట పూర్వం. సోహ్రాబుమోడీ, మెహబూబ్, ఏ. ఆర్. కర్దార్, నాగిరెడ్డి, లీనా చెట్టి

(55- వ పేజీ చూడండి)

# గృహాన్వేషణ

ప్రియమైన సుశీలకు: క్షేమంగానే వుద్యోగంలో జాయినయాను. నీతోటి ఆనందాన్ని అధికంగా అనుభవించ నీకుండా యీ రైల్వే వాళ్లు సెలవు తక్కువిచ్చి కట్టి తెచ్చారు మనిద్దరికీ విరహం తెస్తో - అయితే వెనకటికి 'చలం' అన్నట్టు విరహం సంభవిస్తే కాని ప్రేమలేఖలు పుటవు, 'పెద్దలకు దండములు, పిన్నలకు దీవనలు' మాడల్ వుత్తరాలు కట్టిపెట్టి, కథల్లాగా వుత్తరాలు రాయడం నీకు నేర్పడానికే ఈ వుత్తరం వ్రాస్తున్నాను.

ఇక్కడి మూడుహోటళ్ళనూ, 'టర్న్' ప్రకారం మారుస్తు వచ్చాను. అయితే నాకు ముగ్గురూ గడ్డి పెడదామని కూడబలుక్కున్నట్లు తోచింది. అప్పుడప్పుడు పిడకలలు కూడా వొస్తున్నాయి. అందులో అడుగో అర్జీ అయ్యారంటున్నాడు—"మనం మంచి తిండిపెడితే బతకనిస్తారటండి యిక్కడి వాళ్లు? రెండుపూటలకి సరిపడగా ఒక్కసారే తినిపూడుస్తారు" అంటోంటే "నిజం, నిజం" అని తప్పట్లు వేస్తున్నాడు రామారావు. నిజమేగాబోలని కళ్ళద్దాల్లోంచి చూస్తో గుజరాతీ హోటల్ వాడు సానుభూతి ప్రకటిస్తోన్నట్టు నాకు తళుకులు కలలొస్తున్నాయి. ఇవితప్ప యీ వూరివాళ్ళకి భోజన సౌకర్యంలేదు మరి.

భార్యల్ని పుట్టింటికి పంపినవాళ్ళకీ, పెళ్ళికాని బ్రహ్మచారులకీ, పెళ్లియిన్నీ యిల్లు దొరక్క బ్రహ్మచర్యం సాగిస్తోన్న 'నాతిగల బ్రహ్మచారులకీ, పోట్లాడుకుని భార్యా వియోగం అనుభవిస్తున్న వాళ్లకీ యీ వూళ్లో వీళ్లుతప్ప భోజనంపెట్టే దాతలేదు. 'నీవే తల్లివి తండ్రివి, నీవే నా తోడునీడ, నీవే సఖుడవు, గురుడవు, భార్యవు, భర్తవు' అని కృష్ణశతకం జ్ఞాపకం వొస్తోంది.

పై పిడకలల బాధ జాస్తీ అయి గృహాన్వేషణకు బయల్దేరాను. కష్టపడి మంత్రి పదవినైనా సంపాయించవచ్చును గాని, యీ వూళ్ళో అద్దెయిల్లు సంపాదించడం సాధ్యమయేపనికాదు. అథవా యెవడైనా సంపాయించ గలిగినా, వాడికి యే 'రావు బహదూర్' 'లాల్ బహదూర్' యిచ్చి సత్కరించ వలసిందే!

సాధ్యమైనంత త్వరగా యిల్లు సంపాయించడానికి ప్రయత్నిస్తున్నాను.

జవాబుమాత్రం రాయి. నీ—

భాను.

## 2

ప్రియ సుశీలకు—

నువ్వు చదివిన చదువే మరిచిపోయావో, లేక మీ వూరి పోస్టాఫీసు వాళ్ళకి 'సట్లు' వొదులయాయో తెలీదుగాని నీ దస్తూరి కనబడ్డం మానేసి చాలా రోజులయింది. ఒకవేళ నువ్వు చదువు మరిచిపోయిన పక్షంలో మీ తమ్ముడు బాబిగాడిచేత వ్రాయించవలసింది.

అక్కడ నేనున్నప్పుడు తరచు వస్తూండమని నువ్వు చెప్పినట్టు జ్ఞాపకం. ఇంకా రైల్వేవాళ్ళు నాలాంటి వాళ్లకోసం రైలు చార్జీలు 'మాఫీ' చెయ్యలేదు. రెండో పంచవర్ష ప్రణాళికలో అన్నిరకాల వాళ్ళకీ సౌకర్యాలు కలగజేశారు గాని, నాలాంటి 'నాతిగల బ్రహ్మచారు'లకి యే విధమైన 'ఎలాట్ మెంటు' చెయ్యకపోవడం నిజంగా ఘోరమే!

## జీవన్

ఈ బాడుగ యిళ్లకోసం తిరిగి తిరిగి నాకు నీరసం పట్టుకుంటోంది. కసితీరా యీ 'బాడుగ యిళ్ళ'ను 'బాడఖో యిళ్ళ'ని తిట్టాలనిపిస్తుంది.

ఏమయినా నా ప్రయత్నాలు మాత్రం విడవలేదు. బాబిగాడికి నా ముద్దులు.

జవాబు రాయిస్తావుగా!

నీ

భాను.

## 3

డియర్ సుశీలాదేవి:

నీ కంత తొందరగా యిక్కడికి రావాలనుందో, అంత కంటె వేగంగా తీసుకురావాలని నాకూ వుంది. అయినా అది మనిద్దరి చేతుల్లో లేకపోవడం చేత ముందుకు సాగలేకపోతున్నాం.

నా 'బసాన్వేషణ'లో మరో మెట్టు ముందుకెళ్లాను. అసలు ముందిక్కడి వాతావరణాన్ని పూర్తిగా వివరిస్తే తప్ప ఇక్కడి పరిస్థితులు నీ కర్థంకావు. అంతా రైల్వే కాలనీ తప్పించి, వున్న సివిల్ కాలనీ చాలా చిన్నది. అందులో శుభ్రత చాలా తక్కువ. కొన్ని ప్రాంతాలు చూస్తే అక్కడ మనుషులుంటారో, పందులుంటాయో పోల్చడం చాలా కష్టం. బహుశా రెండు జాతులూ కలిసి వుంటూంటాయి.

ఉన్న కొద్దిపాటి ఇళ్లూ చాలా పెద్ద అద్దెలకుగాని లభించవు. ఉన్నా, ఇళ్ళ యజమానులు తొంభైతొమ్మిది నిబంధనలు పెడతారు.

ఇటీవలి నా అనుభవాన్ని నీకు చెప్పకుండా వుండలేక పోతున్నాను.

పుల్లాభొట్ల శంకరంగారని మనశాఖ వారే...ఆయనయింట్లో ఒక భాగం ఖాళీగా వుందనివెళ్లి అద్దెకడిగితే, నా పుట్టుపూర్వోత్తరాలన్నీ కనుక్కుని 'పెళ్ళయిందా?' అన్నాడు. అయిందన్నాను. నమ్మకం కల్గలేదన్నాడు, పైగా కారణాలుకూడా వివరించాడు. కొంతమంది పెళ్ళయిందనీ, భార్య పుట్టింటిదగ్గర వుందనీ బొంకి ఇల్లు సంపాయించి చుట్టుప్రక్కల సంసారుల ఇళ్ళల్లో బూడిదపోస్తున్నారని సోదాహరణంగా వివరించిచెప్పాడు. అందుచేత మీనాన్న వేయించిన మనపెళ్ళిశుభలేఖ ఒకటి పంపించవలసింది. కనీసం దాని ఆధారంతోనయినా, ఆయన్ని ఒప్పించడానికి ప్రయత్నిస్తాను.

ఇంకా సౌశీల్యం గురించి Character యిద్దరు గెజెటెడ్ ఆఫీసర్లిచ్చినసర్టిఫికేట్లనూ, మా కాలేజీ ప్రిన్సిపాలిచ్చిన 'కాండక్టు సర్టిఫికేట్' నూ చూపించాను. పైగా 'సుశీలాపతి'నని మనవిచేసినా ఆయన నమ్మినట్టు కనబడదు.

సూటిగా నా మొహమ్మీదఅనకపోయినా పరోక్షంగా డొంక తిరుగుడు తోవలో చెప్పాడు - "నీవు చదువుకునేటప్పుడు అమ్మాయిల్ని మహాయేడిపించేవాడివటగదూ అని. వాళ్ళింట్లో అమ్మాయి లున్నారని నాకు తరవాత తెలిసింది.

ఇంకో నయం. 'నువ్వు నాకు కలలో పోరంబోకుగా కనిపించావు. అందుచేత



# గృహాన్వేషణ



ఇల్లిస్తాను' అనలేదు. పిడకలలబాధ నాకు తెలుసునుగా మరి!

ముక్తికోసమైనా కాశానికోసారి మూడు కానలు పోసువాళ్ళకి ధర్మంచెయ్యి. రుక్మిణీదేవి చేతి తులసిదళంలో లాగా నీ ముక్కానీ అయినా వాళ్లలోటు బడ్జెట్ పూడ్చగలదేమో!

నీ
కాను.

## 4

ప్రియ సుశీలారాణికి—

నువ్వు నాతో సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించినట్టుంది. ఎప్పుడూ ఈ పూరి పోసువాళ్ళే బ్రతుకుతున్నారు గాని మీ పూరి వాళ్ళు నీవల్ల ఒక్కకానీ అయినా తిన్న పాపానపోలేదు.

మా తమ్ముడు లక్ష్మణరావు కిక్కడెవరో పి. యస్. సోమయాజులుగారుట, వారి తమ్ముడిగారమ్మాయి వున్నది. వెళ్లిచూసి రమ్మని మా నాన్నగారు రాశారు. ఆయన ఆఫీసు, అడ్రసుకూడా ఇచ్చారు.

ఒక శుభముహూర్తాన యాజులుగార్ని సంప్రదిస్తే, వాళ్ల తమ్ముడింటికి తీసుకెళ్లారు. ఒక్కక్షణం ఆ యాజులుగారి తమ్ముడూ, నేనూ పెళ్ళిరాటల్లాగా కొయ్యబారిపోయాం ఆయనింకెవరో గాదు. నా సౌశీల్యమ్మీద "రిమార్కు" పారేసిన శ్రీశ్రీశ్రీ శంకరంగారే!

పది నిముషాలవరకూ మేము ఒకళ్ళనొకళ్ళు చూసుకుంటూ నిల్చుండిపోయాం. అయినా తప్పదు గనక ఆయనలోనికి వెళ్ళి టిఫీను తెచ్చి, కాఫీని అమ్మాయిచేత పంపించమని ఆర్డరిచ్చి వచ్చాడు.

మనిషంటే అక్కడున్నాడు కాని, మనసుమరోచోట పనిచేస్తోంది.

అమ్మాయి కాఫీతోసహా లోపలికి వొచ్చి వినయంగా మా ఇద్దరికీ ఇచ్చి ఎదురుగా కూచుంది.

కాఫీ కూడా చప్పరించడం పూర్తిచేసి— "అమ్మాయి పేరు లలితే కాండీ?"—అనడిగాను శంకరంగార్ని.

ఆవులిస్తే పేవులు లెఖ్ఖట్టే రకమనుకున్నాడో యేమో, "అవును బాబూ!" అన్నాడు ప్లేటు తిరగేస్తూ.

"ఈ అమ్మాయి స్కూల్లో అన్నివిషయాల్లోనూ విచ్చలవిడిగా తిరిగేదని విన్నానండి" అన్నాను సూటిగా ఆయన వంక చూస్తూ.

అప్పటి ఆయన ముఖారవిందాన్ని వర్ణించడానికి మరో మహాకవి ఉద్భవించాల్సిందే గాని, నాచేతకాదు. సిగ్గు, రౌద్రం కలగాపులగంగా తాండవించాయి ఆయన ముఖంలో.

అంతటితో పూరుకోక—"ఇంతకు ముందెవరో ప్రేమించిందట గదండీ—" అన్నాను.

దాంతో ఆయన ముఖంలో రక్తమంతా ఎక్కడ దాక్కుందో తెలీదుగాని ముగ్గుపిండిలాగా తెల్లబారిపోయింది.

మారుతున్న ఆయన ముఖ కవళికల్ని చూస్తోంటే నాకు భయమేసి మరి అక్కడ నిలవకుండా గబగబా వొచ్చేశాను.

బాబిగాడికి ముద్దులు. జవాబులు రాయడం అలవాటుచేస్తూండు.

నీ
కాను.

## 5

సుశీలాకుమారీ!—

ఒక శుభవార్త. యింటికోసం నేను మొక్కిన మొక్కులూ, నా తరఫున నువ్వు నోచిన నోములూ ఈనాటికి ఫలించాయి.

అంతకుముందు రాశానే శంకరంగార్ని గురించీ, ఆయన పుత్రికారత్నం లలితాదేవి గురించీను. ఆయన యేమనుకున్నాడో నేను వూహించగలిగినంతవరకూ యిది—"సెకనుకి రేడియో తరంగాలు లక్షాయెనభైఆరు వేల మైళ్ల వేగంతో ప్రయాణంచేస్తాయని శాస్త్రజ్ఞులు చెబితే వినడమేగాని మనకి తెలీదు. కాని అమ్మాయిల ప్రేమకలాపాల వార్తలూ లోకం దృష్టిలో నీతిదూరమైన చర్యలుగా పరిగణింపబడే చేష్టల వివరాలూ—'పంపు' దగ్గర గుమిగూడే అమ్మలక్కల ద్వారానూ, కాలక్షేపం కాని సాయంత్రంపూట వూరిమీద తిరిగే ఆంబోతులద్వారానూ సెకనుకి రెండు లక్షలమైళ్ళ దూరంతో పయనిస్తాయి" అని అనుకున్నాడో మరేమో!

నిన్నటే వొచ్చి వెంటనే ఇంట్లోదిగవలసిందనీ, నిన్ను రమ్మని అర్జెంటుగా వైరిమ్మనీ బ్రతిమాలాడు. కొంచెం బెట్టుగానే మాట్లాడాను. అయినా ఈవాళే సామానులు ఆ యింటిలోకి మారుస్తున్నాను. లలితను మా తమ్ముడికి ఖాయం చేసినట్టే.

అందుచేత వెంటనే బయల్దేరి రావలసింది, వచ్చేముందర ఒక కార్డుముక్క రాస్తే స్టేషనుకు రాగలను.

నీ
కాను

## 6

డియర్ డార్లింగ్!

నువ్వురాసిన ఉత్తరం అందింది. మంచి ముహూర్తాలకోసం నువ్వు ఆలస్యం

చెయ్యడం నన్నింకా త్రిశంకుస్వర్గంలో వేలాడదియ్యడంలాగే వుంది.

నీతో మీ 'బామ్మ' వొస్తుందన్న సంగతి ముందుగానే తెలుసుంటే ఇంతకంటె మంచి ఇల్లే–ఒకటి తీసుకుని వుందును. అనవసరంగా చెయ్యి జారిపోయింది. కాని ఆ ఇంటి చుట్టుపట్ల దెయ్యాలూ, భూతాలూ తిరుగుతుంటాయని చెబితే మానేశాను.

దెయ్యాలకైనా భయపడనుగాని మీ బామ్మకు దడుసుకుంటాను. పెళ్ళిచూపులకొచ్చినప్పుడు, నన్ను చూసి అందంగా లేడని మీ బామ్మ అంటే భయంతో కుంచించుకుపోయిన నన్ను రక్షించడానికి స్వర్గంనించి మా తాతలు దిగిరావలసి వచ్చింది. 'సినీమా తారలకు సౌందర్యము నిచ్చు సబ్బు' రాసుకునే నన్నే అందంగా లేడన్న మీ బామ్మకి మూర్కు తలుచుకున్నప్పుడల్లా, నన్ను చేసుకోడానికి నువ్వెలా అంగీకరించావో తెలీక కొట్టుకుంటూంటాను. అందుచేత మీ బామ్మను చూస్తే దెయ్యాలూ, భూతాలు మరి రావని నా విశ్వాసం.

ఇంతకీ నీకు కాబోయే తోటికోడలిమీద నున్న అపవాదు నిజమో, కాదో తెలీడం లేదంటావా?

అదంతా నా గృహాన్వేషణలో పన్నిన పద్మవ్యూహం అని తెలిసి నువ్వు సంతోషించినా, సంతోషించకపోయినా—ఇల్లు సంపాయించడంలో నేను సాధించిన ఘన విజయానికి ప్రజలంతా సన్మానం చేసి యేదో పెద్ద బిరుదు పారేసి తీరతారు.

అందుకే నా విజయవివరా లన్నీ ఆంధ్ర పత్రికలో వేయించదలచుకున్నాను. ఏ మహానుభావుడయినా నా గొప్పతనాన్ని గుర్తించి మెచ్చుకుని ఘనమైన సన్మానంతో బిరుద ప్రదానం చేస్తాడనే ధైర్యంతో.

ఇక్కడ ఇల్లద్దెకు సంపాయించడం ఎంత కష్టమో తెలీనివాళ్ళకు నా గొప్పతనం తెలియదు లే మరి!

వచ్చేప్పుడు కొత్త సంసారానికి కావలసిన సరంజామా అంతా తేవడం మరచిపోకు. ఎందుకంటే యిక్కడవన్నీ కొనాలంటే ధరలు ఎవరెస్టు శిఖరాన్ని మించి ఎత్తులో వుండడమే గాక మీ నాన్న 'బ్యాంకు బాలెన్సు' తగ్గి నూచన ఉండవేమోనని భయపడుతున్నాను.

నీరాకకోసం యెదురు చూస్తోన్న—

నీ—

రాజు.



# ఆరోగ్యమునందు ప్రీతిగలవారు ఎల్లప్పుడూ లైఫ్‌బాయ్‌తో స్నానము చేయుదురు

ఆరోగ్యము కొరకు ఆటలు ఆడుట అవశ్యకమైయున్నది—అయితే ఆటయందుగాని లేక పనియందుగాని మనము ఎల్లప్పుడూ మురికిగా నగుదుము. మురికిలో వ్యాధి కారకములగు క్రిములున్నవి. వాటివల్ల మన ఆరోగ్యమునకు ఎడతెగని ప్రమాదమున్నది. లైఫ్‌బాయ్ సబ్బు మురికిలోని క్రిములను కడిగివేసి మిమ్ములను రక్షించును.

లైఫ్‌బాయ్ సబ్బుతో ప్రతిరోజూ స్నానము చేసి మురికిలోని క్రిముల బారి నుండి మీ ఆరోగ్యమును కాపాడుకొనుడు. ఇందువల్ల మీరు మరల హాయిగా నుందురు.




L. 260-X52 TL

# రక్షించిన ఫ్లూ

"కృష్ణవేణీపుష్కరానికి బెజవాడకు మూడులక్షలమంది వస్తారని అంచనా వేయబడింది. ప్రయాణీకుల సౌకర్యానికై అరవై ప్రత్యేక రైళ్ళు, నలభై ప్రత్యేక బస్సులు వేశారు. బెజవాడ రైల్వేస్టేషన్‌లో క్రొత్తగా కాంటీనులు తెరిచారు. సత్యనారాయణపురం స్టేషన్ వద్దకూడా క్రొత్త కాంటీనులు, పాకలు వేయనున్నారు" వార్త చదువుతున్నంతసేపూ, తాలూకా ఆఫీసు గుమాస్తా శేషగిరిరావు మనస్సెక్కడో పని చేస్తున్నది. పుష్కరం మొదలెట్టటానికి దాదాపు యింకా పది పన్నెండు రోజులుంది, ఇక ఏంచూడలేక పేపరు మూసేశాడు. ఏదో ఆలోచల్లో మునిగిపోయాడు. బెజవాడకి మూడులక్షలమంది వస్తారని అంచనా వేయబడింది, అరవై స్పెషల్ ట్రైనులు, నలభై బస్సులు, బుర్రలో గిర్రున తిరుగుతున్నాయి. బెజవాడకి మూడు లక్షల మంది వస్తారని అంచనా వేస్తే, తనింటికి కనీసం ముప్పైమందన్నా వస్తారని అంచనా వేసుకొన్నాడు శేషగిరి. తనవంక వాళ్ళూ, తన భార్యవంక వాళ్ళూ, ఇంకా తెలిసున్న వాళ్ళూ ముప్పయిమందికి తక్కువ ఉండరు. ఈ ముప్పై మందీ పన్నెండు రోజులూ ఉంటారు. ఏంచేయాలి?

అతన్ని ఊహాలోకంలోనుంచి బాహ్య ప్రపంచానికి ఈడ్చుకొచ్చింది పోస్టుమాన్ కేక.

అదుర్దాగా లేచివెళ్ళి అందుకున్నాడు పోస్టుని. ఆఫీసుకి సంబంధించిన వన్నీ ఏరి వేరేపెట్టి, తన పేరున ఉన్న రెండు కవర్లూ తీసికొని తన స్థానంలోకెళ్ళి కూర్చున్నాడు శేషగిరి, కవర్లపైవ్రాసిన ఎడ్రసులదస్తూరీని బట్టి అవి వాళ్ళ బావమరుదులదగ్గర్నుంచి అని గ్రహించుకుని కవర్లనిచింపి ఒకటొకటి చదివాడు. ఏమున్నాయి విశేషాలు! కృష్ణా పుష్కరాలకి సకుటుంబంగా వస్తున్నామని వ్రాశారు. అక్క కాస్త నిష్ఠూరంగా వ్రాసింది. రెండు ఉత్తరాలనీ మడిచి, జేబులో పెట్టుకుని ఆఫీసుపనిలో బలవంతాన లీనమయ్యాడు శేషగిరి.

ఆఫీసుగడియారం అయిదుకొట్టి విశ్రాంతి నిచ్చింది పనిచేసేవాళ్ళకి. శేషగిరి ఆఫీసు బైట పడ్డాడు.

అడుగులుపడుతున్నాయి బరువుగా రోడ్డుమీద. ఆలోచనలతో నిండిపోతోంది బుర్ర. మూడులక్షల జనం, అరవై ప్రత్యేక రైళ్ళు, నలభై బస్సులు, స్టేషన్‌లోకట్టిన క్రొత్త కాంటీనులు, కృష్ణ ఒడ్డున వేసే పాకలు, ఆరోగ్యశాఖవారు, అంటువ్యాధులు వ్యాపించకుండా తీసుకోబోయే జాగ్రత్తలు రక్షకభటశాఖ తీసికోబోయే జాగ్రత్తలు, కన్నుల పండుగలా ఉండబోయే బెజవాడ, కలకల్లాడుతూ జన సంచారంతో నిండబోయే బెజవాడ పురవీథులు, ఎక్కడ చూచినా క్రొత్త అందాలతో చిందులాడే పట్టణం, క్రొత్త క్రొత్త బొమ్మల దుకాణాలు, పరవళ్ళు త్రొక్కే కృష్ణవేణీనది, ఒక్కసారి శేషగిరి మనోవీథిలో మెరిశాయి. అబ్బ ఎంత అందంగా ఉంటుందీ పట్టణం, ఎంత ఉత్సాహంగా ఉంటుందీ పురం! అని ఏదో

## కుమారి ఆదుర్తిబాల

ఊహిస్తున్నాడు. అలవాటుప్రకారం అతని కాళ్ళు సూర్యారావుపేటలో నున్న అతని అద్దెకొంపకి చేరేశాయి. గుమ్మంలో కాలు పెడుతూనే నిజస్థితికి వచ్చాడు శేషగిరి. సంపదలకి లోటున్నా, సంతానానికి లోటు లేదన్నట్లు, అతగాడికి ఆరుగురు పిల్లలు; భార్యకి పురిటిరోజులు...

ఇంట్లో వెలుగుతున్న చిన్న దీపం ముందు కూర్చుని చదువుకోటానికి వ్యర్థప్రయత్నం చేస్తున్నాడు అగ్రతనూజుడు. శేషగిరి చెప్పుల చప్పుడువిని, నేలమీదపడిదొర్లుతున్న దల్లా చివాలున లేచి, "నాన్న వచ్చారు" అంది మూడవపిల్ల. అక్కడ అంతవరకు ఆడుకుంటున్న ఆఖరుపిల్ల నాన్నని చూడగానే "నా...నా ఎ...త్తు" అంది వచ్చీరాని మాటలతో కాళ్ళకి చుట్టేస్తూ. శేషగిరికి తప్పలేదు దాన్ని ఎత్తుకోక. దాన్ని చంక వేసుకుంటూనే ఉన్నాడు. ఇంతలో నాలుగవ అయిదవ పిల్లలిద్దరూ వీథిలోంచి లోపల కొచ్చారు. అయిదవపిల్ల ఏడుస్తుంటే నాల్గవ వాడు దాన్ని ఈడ్చుకొని వస్తున్నాడు. ఆ పిల్ల యింటి పెంకు లెగిరిపోయేటట్లుఅరుస్తోంది. అంతలో అర్ధాంగి పిల్లఏడుపు విని చేతిలో అన్నంగరిటతో సహా ప్రవేశించింది రంగంలోకి "ఏమయిందిరా" అంటూ. "చూడు దీనికి రంగమ్మగారి అమ్మాయి బొమ్మలు కావాలిట, అవి పట్టుకొని పరుగెత్తుకొచ్చేస్తోంది. నే చూచి, నాలుగు తగిల్చిచ్చి వాళ్ళ బొమ్మ లిప్పించేసి,తీసికొచ్చా. దొంగ ముండ," అన్నాడు, అపరాధ పరిశోధకుని పోజుపెట్టి. అది 'బంయ్' మని అరుస్తూనే అమ్మదగ్గర కెళ్ళింది. అర్ధాంగి నీళ్ళగోల పడలేక దాన్ని రెండు మొట్టి యింట్లోకెళ్ళింది. అతనివంక చూడనన్నా లేదు.

మూడవది మళ్ళీ నేలమీదపడి, 'ఆకలో' అంటూ దొర్లటం మొదలెట్టింది. రెండవ వాడు తలకాయ నొప్పితో బాధ పడుతూ చాపమీద పడుకున్నాడు. అయిదవదానికి మొట్టికాయలు పడటంతో రాగం తారస్థాయి నందుకుంది. శేషగిరి స్థాణువులా నిలబడ్డాడు అయిదు నిముషాలు ప్రతిరోజూ ఈ గొడవ మామూలే. అతనికీ అలవాటయిపోయింది. ఆరోదాన్ని క్రిందికి దింపి అయిదవదాన్ని చంక నేసుకొని వీథిలో కెళ్ళాడు. ఇంకా మూడవదానిగోల ఉండనే ఉంది 'ఆకలో' అంటూ. అయిదవది కాస్త ఊరుకోగానే యింట్లోదింపి బావిదగ్గరకెళ్ళి కాళ్ళూ చేతులూ కడుక్కొని పడక్కుర్చీలో కూర్చుని పెద్దవాడిని కాస్త మంచి నీళ్ళు తెమ్మని తాగి నిమ్మళించారు.

"అలసి,సొలసి, యింటికి చేరితే 'అయ్యో' అని ఆదరించే దిక్కు లేదు కదా", అనుకుంటూ, రెండవవాని నుద్దేశించి, "ఏరా నీకు తలనొప్పి తగ్గలేదటరా" అన్నాడు. వాడు మూలుగుతూనే "లేద"ని సమాధానం చెప్పాడు. ఇంకేం మాట్లాడకుండా పడుకున్నాడు శేషగిరి కళ్ళు మూసికొని. వంటింట్లో పిల్లలగోల ఎక్కువగా ఉంది. అంతా "ఆకలే అన్నం పెట్టు" అని గోల చేస్తున్నారు. అర్ధాంగి సాధింపులూ వినబడుతున్నాయి. "మింగటానికి ముందే తయారు. మీ నాన్న తేవటానికి, మీరు తినటానికి సరిపోయింది. ప్రొద్దుటనగా, బియ్యం, బొగ్గులూ అయిపోయాయని చెపితే, లేకుండా, చేతులూపుకుంటూ వచ్చారు. ఏంతిందామనో. ఇక మీరు చూడబోతే 'గుడిమింగమా, గుళ్ళో లింగాన్ని మింగమా' అని చూస్తుంటారు. సరి

# ★ రక్షించిన ఫ్లూ ★

...ద్రానికి మొదటికారణం సంతానం" ఈ విధంగా సాగుతున్నాయి సాధింపులు. శేషగిరి మనసు వెయ్యి ముక్కలయిపోతోంది. గుండెపై ఎవరో, పెద్ద బండరాయిని పెట్టినట్లుంది. అర్థం, పర్థం తెలియని కనుగాయలు, వాళ్ళనితిడితే వాళ్ళకేం తెలుస్తుంది నాన్న అసమర్థత, తల్లి ఓపలేనితనమూను. శేషగిరి ఆలోచనల్లో పడ్డాడు.

మళ్ళీ అతని కళ్ళముందు కనబడింది వార్తాపత్రికలోని వార్త. బెజవాడకి మూడు లక్షలమంది వస్తారని అంచనా వేయబడింది. తనింటికి ముప్పైమంది వస్తారని అంచనా వేసికొన్నాడు. ముప్పైమందంటే మాటలా! ఎట్లా భరించటం? తనఅక్కయ్యకుటుంబం, చెల్లెలుకుటుంబం, తన మేనమామ, మేనత్త, ఇంకా అనుకోనివాళ్ళు, వీళ్ళు, తనఅర్ధాంగి తైపువాళ్ళు, అత్తగారు, మామగారు, బావమరుదులు, మరదళ్ళు, వాళ్ళ కుటుంబీకులు పదిహేనుకి ఎక్కువే ఉంటారు. తనవంకవాళ్లో పదిహేను నుంచి దాకా ఉంటారు. ఏం తోచటం లేదు శేషగిరికి. అందులో ఏ ఒక్కళ్ళనీ రావద్దని ఉత్తరం వ్రాయటానికిగాని, చెప్పటానికిగాని వీలులేదు. తన అక్కని వద్దంటాడా? చెల్లెల్ని వద్దంటాడా? వాళ్ళు వస్తే పొమ్మని ఎలా అంటాడు. వాళ్ళిద్దరికీ బట్టలు పెట్టడం తప్పదు కదా. ఇవాళ వాళ్ళక్క నిష్ఠూరంగా కూడా వ్రాసింది. 'అమ్మా నాన్న పోయాక పుట్టింటినుంచి గోరడు పసుపుగాని, కుంకుమగాని, జాకెట్టు ముక్కగాని ఎరగం' అని. ఎటూ అక్కచెల్లెలు తప్పరు. పోతే మేనమామ ఎట్లా తప్పతాడు? నాన్న పోయిం దగ్గర్నుంచి ఆయన దగ్గరే ఉండి చదువు సాగించాడాయె. మేనత్త మాత్రం ఏలా తప్పతుంది? చూడు, నాలుగోజుల భాగ్యానికి శేషగిరి ముఖం చూచుకున్నాడంటారు. ఇక అర్ధాంగివంకవారు అసలే తప్పరు. అత్తవారిని ఏమంటాడు? ఈ పుష్కరం వంకతో తన పని అయిందన్నమాటే. వచ్చిన వాళ్ళందరికీ మర్యాద ఎలా జరిపించగలడు. అందులో అందరూ మర్యాద జరిపించుకునేవాళ్ళే. ఎక్కడనుంచి తెస్తాడు డబ్బూ, సరుకులూను? ఎవడిస్తాడప్పు? ఇంట్లో పిల్లలతో యిప్పటికే సతమతమవుతున్నాడు. జీతాలందటానికి యింకా వారం రోజులు వ్యవధి ఉంది. జీతం వస్తే చాలు నిముషంలో అయిపోతుంది. పాత బాకీలు చాలెడున్నాయి. తెచ్చిన జీతం అసలు చాలేచాలదు. ఒక్కరోజూ జీవితంలో తనుసుఖపడ్డాడనిలేదు. ఏ రోజూ తను సుఖశాంతులతో గడపలేదు. ఇకముందు మాత్రం తన జీవితం సుఖపడుతుందన్న నమ్మకమేమిటి? ఏమీ లేదు. గంపెడు సంసారం. పైగా ఈ పుష్కరం ఒకటి. తనలాటి గుమాస్తాగాళ్ళ జీవితాలతో పరిహాసాలాడటానికే వస్తాయి పుష్కరాలాటివి. తనలాటి గుమాస్తా గాళ్ళెంత మందిపుష్కరంబారికి గురవుతున్నారో గదా?

పన్నెండు సంవత్సరాలికి ఒక్కసారి వస్తుంది పుష్కరం. మళ్ళీ పుష్కరం నాటికి ఎవరెల్లాగుంటారో తెలియదు. ఒక్కసారి పుష్కర స్నానం చేయటంవల్ల, చేసిన పాపాలు పోతాయంటారు. గోదావరీ పుష్కరాలకిగాని, గంగా పుష్కరాలకిగాని వెళ్ళేది ఎటూ లేదు. ఉండేది బెజవాడ, వచ్చింది కృష్ణవేణీ పుష్కరం, చేద్దాం స్నానం, ఉంగాం సంతోషంగా అంటే వీలు లేదు కదా. ఈ చుట్టాలబాధొకటి. ఈ బాధ లేకపోతే తనెంత సంతోషించేవాడో. తనదగ్గర కుక్క డబ్బు లేకపోయినా, చుట్టాలదాడి లేకపోతే, కలో, గంజో తాగి విశ్రాంతిగా ఉండగలడు. అయినా తను చేయగలిగిందేమీ లేదు. ఈ చుట్టాల దాడి తప్పదు. తనకి పరాజయం తప్పదు. ఎక్కడా అప్పు పుట్టదు. రెండు రోజులుండేసరికే శేషగిరి "ఇది" అయిపోయాడని అనక తప్పదు. వాళ్లు పల్లెటూరువాళ్లు బెజవాడ వచ్చారంటే ఓ పట్టాన వదలరు. ఏం చేయాలి? వీళ్ళందర్నీ ఎలాభరించాలి? ఇదే శేషగిరి సమస్య.

సమస్య తెగటంలేదు. అప్పు మాత్రం పుట్టదు. పోతే తాకట్టుపెట్టటానికి తన దగ్గరేంలేదు. అర్ధాంగి మెళ్లో పెళ్ళినాడు పెటిన హారం అవతలికి నడిచి, ఏడాదయింది. ఇంట్లో ఇత్తడిసామానూ, అల్యూమినియం సామానూ, తప్ప ఏంలేవు. ఇల్లయినా అద్దె కొంప, వచ్చే చుట్టాలని ఎలా భరించాలి? అర్ధాంగి: పురుడొచ్చినా బాగుండును. ఆలోచనాపరంపరలకి ఆనకట్టపడింది. అర్ధాంగి పిలుపు ఆప్యాయంగా శ్రవణపుటాల్లోకి చొచ్చుకెళ్ళింది. కళ్లు విప్పిచూచాడు. ఎదురుగా నిలబడ్డ అర్ధాంగి పెదవులపై నిలచిన దరహాసరేఖని వీక్షించి 'ఏం కొంప మునిగిందా?' అనుకున్నాడు. అర్ధాంగి దరహాస చంద్రికలు, తన కొంప ముంచటానికని తనకి తెలుసు. కోపతాపాలతో ఆహ్వానించినరోజు మామూలుగా గడిచిపోతుంది? కాని దరహాసచంద్రికలు తోచినవంటే తన కొంప పూర్తిగా మునిగిందన్నమాటే.

పోయినవారం సరిగా ఆరోజునే అర్ధాంగి దరహాసచంద్రికలని వీక్షించాడు. విషయం ఏమిటని అడిగితే మర్నాడు ప్రొద్దున్న మెయిల్లో తన అన్నగారిరాకే ఈ దరహాసానికి కారణం అని ఆమె చెప్పింది. అప్పుడు

తను "హాఁ చచ్చితి" ననుకొని రాత్రి తొమ్మిది గంటలవేళ, సంచీ పుచ్చుకొని కొత్త కోమటి కొట్టుకెళ్ళి, దానిని బ్రతిమాలి పద్దువ్రాసి సరకులు తెచ్చి, మద్రాసునుంచి వచ్చిన బావ మరదికి సకల మర్యాదలు జరిపి 'ఎందు కొచ్చిన దంపటా' అని మనసులో అను కున్నా, మూడురోజు లుంచుకొని పంపిన విషయం చటుక్కున గుర్తొచ్చింది శేషగిరికి.

ఈనాడు అర్ధాంగి చిరునవ్వుకి కారణం, వాళ్ళ అమ్మావాళ్లో పుష్కరాలకి వస్తున్నా మని ఉత్తరం వ్రాయడమయి ఉంటుం దని ఊహించుకుంటున్నాడు. అందుకే తను అర్ధాంగినుంచి దరహాసచంద్రికల్ని కాంక్షిం చడు. కోపతాపాలనే కోరుకుంటాడు.

"భోజనానికి లేవండి" అంది అర్ధాంగి సన్నగా చిరునవ్వులని చిందిస్తూ.

అప్పుడే పూర్తిగా ఈ లోకంలో కొచ్చిన శేషగిరి గదంతా పరికించి చూచాడు. పిల్ల లంతా నిద్రపోతున్నారు. అగ్రతనూజుడు మాత్రం దీపందగ్గర కునికిపాట్లు పడు తున్నాడు. అప్పుడు టైం తొమ్మిదయి ఉంటుందని గ్రహించాడు శేషగిరి.

"ఎంత లేపినా లేవరేం, అంత అలసి పోయారా?"

'అలసిపోయారా అని అడుగుతావా? ఎంత అలసానో నీకేం తెలుసు,' అందా మనుకున్నాడు కాని మాట పెగిలిరాలేదు. నీరసంగా ఉంది. ప్రొద్దుటపదింటికి తిన్న మెతుకులు. తరువాత మంచి నీళ్ళుతప్ప, కాఫీ నీళ్ళన్నా త్రాగినపాపాన పోలేదు. కళ్లు తిరుగుతున్నట్లుకూడా ఉంది.

"వడ్డించాను. రండి" అంటూ తను ముందడుగెయ్యటం మొదలెట్టింది అర్ధాంగి.

కుర్చీలోంచి లేచి "ఇక పడుకోరా" అని పెద్దవాడితో అని, వంటింట్లోకెళ్ళి పీట మీద చతికిలపడ్డాడు శేషగిరి. అర్ధాంగి వడ్డిం చిన అన్నం తింటున్నాడు. "ఈవాళ మా నాన్న ఉత్తరం వ్రాసారు," అని అతని కళ్ళల్లోకి చూచింది. ఏమైనా విరుద్ధభావాలు కనబడతాయేమోనని.

శేషగిరి ముందే కారణం ఊహించి ఉండ డంవల్ల "నీ దరహాసచంద్రికలని చూచే అనుకున్నా" అన్నాడు.

అర్ధాంగి చిరుకోపంతో బుంగమూతి పెట్టి "మీ రెప్పుడూ అలాగే అంటారు" అంది.

ఆమె బుంగమూతి చూస్తుంటే పెండ్లయిన కొత్త రోజులు శేషగిరికి జ్ఞాపకం వచ్చాయి. వచ్చేది ఈ జీతం రాళ్లే అయినా ఇంత సంతానం లేదు. అగ్రతనూజుడు పుట్టే దాక ఏం సుఖపడ్డాడో అంతే. ఉసూరు మంది ప్రాణం. ఓసారి గట్టిగానిట్టూర్చాడు.

"ఏం మా వాళ్ళు ఉత్తరం వ్రాశారం టేనే అంతబాధగా ఉందా"

"అబ్బే అదికాదు శ్రీమతీ చారు వేడిగా ఉంది" అన్నాడు శేషగిరి. కాస్సేపాగి, "ఇంతకీ ఏం వ్రాశారేమిటి" అన్నాడు ఇక అడక్కపోతే బాగుండదని.

"ఏముంది, కృష్ణవేణీ పుష్కరాలకి అందరం వస్తున్నాం. మళ్ళీ పుష్కరం నాటికి ఎవరెలాగుంటామో తెలియదు గదా. ఈ వంకనన్నా మీరు కళ్లపడతారు. ఒక్క సారి ఈ ఊరు రమ్మంటే అల్లుడుగారు పంపరు అని."

"ఉహుఁ" అని చెయికడుక్కుని లేచి

(౩౩-వ పేజీ చూడండి)

# జీవిత సత్యాలు



బస్సు దిగేసరికి, సామాను అందుకునేందుకు పనికుర్రవాడితోబాటు, ఇంకో యువకుడుకూడా వుండటం గమనించింది సుమిత్ర. గుడిసెబండిలో దిళ్లు అమర్చుకుని, వాలులోకూర్చుని బండితోలుతున్న ఆయువకుణ్ణి చూసింది. పాలేరు బండివెనక నడుస్తున్నాడు—సుమిత్ర అడిగేవాటికి సమాధానాలిస్తూ. 'నల్లగావున్నా కళగల మొహం' అనుకుంది సుమిత్ర. మధ్యమధ్య ఆ యువకుడి వేపు సుమిత్ర చూడటం గమనించి, పాలేరు

ఎమ్. జానకీరాణి

వాడు, "మన నాగభూషణం అమ్మాయి గోరూ" అన్నాడు, ఆ ఒక్క పేరు సుమిత్రకెంతో తెలియచేస్తుం దన్నట్టుగా. సుమిత్రకేమీ అంతుచిక్కకపోయినా తలూపింది.

ఇంటికి చేరగానే తండ్రిని, తల్లినిచూసిన సంతోషం — మళ్ళీ స్వస్థలానికిచేరిన ఆ సంతృప్తి—వీటితో రెండురోజులబాటు నాగభూషణంసంగతే గుర్తులేదు సుమిత్రకి. ఆనర్సుపరీక్ష వ్రాసివచ్చినతర్వాత సుమిత్రకి ఒక హుందాతనం అలవడింది.

ఇంటికి చేరగానే మర్నాడే "అప్పిన్నీ, పాఠం చెప్పవూ?" అంటూ తయారైంది కొంచెం దూరపు బంధువు కూతురు — 12 ఏళ్లసీత. ప్రతిసెలవుల్లోనూ, సుమిత్ర పల్లెకి వెళ్లడం — తనున్న నాలుగురోజులూ బంధువులపిల్లల్లో చదువుకోవలసిన యీడువాళ్ళందరికీ పాఠాలుచెప్పడం మామూలు. సుమిత్ర వచ్చేసిన మూడోనాడు పిల్లలు అన్నీ మర్చిపోతారు. మళ్లీ సెలవులకి ప్రారంభం! అవే పుస్తకాలు, అవే గుణింతాలు.

కానీ యీమాటు క్రొత్తఅట్టతోవున్న ఈ ఇంగ్లీషు ప్రైమరీ పుస్తకాన్ని కుతూహలంతో చూసింది సుమిత్ర. పేజీ తిప్పగానే కుదురైన అక్షరాలతో, ఇంగ్లీషులో

సీతపేరు, ఆపల్లెపేరు వున్నది — ఒకటి, రెండు స్పెల్లింగు తప్పులతో.

"ఎవరు రాశారే సీతా యిది?" అన్నది — ఇక్కడ యింగ్లీషు వ్రాసేది ఎవరా అనుకుని.

"నాగభూషణం మెట్రిక్యులేషను తప్పాడుగా. ఇంగ్లీషు మాట్లాడుతాడు కూడాను." అన్నది సీత. మెట్రిక్యులేషను అంటే పెద్ద చదువుక్రిందే లెఖ్ఖ మరి.

"మనింట్లో ఎందుకున్నాడు?" అన్నది సుమిత్ర 'కాట్, రాట్' కల్లితో చదువుతూ.

"వాళ్ళ నాన్న యిక్కడుంచి వెళ్ళాడు. పొలం పనులు నేర్చుకుంటూ, మళ్లీ పరీక్షకి చదువుతాడుట. అసలు వాళ్ళు యిక్కడే యిల్లుకూడా కట్టుకుంటారట" అని చెప్పింది సీత. సీతకి అన్ని వ్యవహారాలు తెలుసు. ఎవరి కెంతపొలం కవులుకిచ్చిందీ, వాళ్ళ వ్యవసాయం ఏస్థితిలో వున్నది అన్నీ తెలుసు ఆపిల్లకి. ముదిమాటలు మాట్లాడుతుంది.

సుమిత్ర పలకమీద రాసియిచ్చిన యింగ్లీషుమాటలు దిద్దుకుంటూనే, నాగభూషణం పుట్టుపూర్వోత్తరాలు, వాళ్ళ కుటుంబ వ్యవహారాలు అంతా చెప్పింది. మెట్రిక్యులేషనుపైన చదువు చెప్పించే స్తోమత లేదు నాగభూషణం తండ్రికి. పూర్తిగా వ్యవసాయంమీద బ్రతికే ఎత్తూ లేదు. "'మనం' వున్నవాళ్ళం కాబట్టి — ఏదో పొట్టకి లోపంవుండదని యిక్కడుంచి వెళ్ళాడు." — ఇవీ సీత వాక్యాలు. "మనవాళ్ళబ్బాయే." ఇదీ అతని అర్హత. నాగభూషణంస్థితిఅర్థమైందిసుమిత్రకి. డి. హెచ్. లారెన్సు వ్రాసిన ఆ నవలకి తటుకో లేక అవస్థపడుతూవున్న సుమిత్రకి, నాగభూషణాన్ని గురించిన ఆలోచన కొంత తెరపియిచ్చింది.

* * *

ప్రొద్దున్న పదకొండింటికి తండ్రికి కాలేజీ విశేషాలు చెబుతోంది సుమిత్ర. నాగభూషణం అప్పుడే వచ్చినట్లుగా వున్నాడు తెల్లవారుఝామునగా పొలానికివెళ్ళి. "ఏం నాగభూషణం! ఎందాకా వచ్చింది పని?" అని పలుకరించారు సుమిత్ర తండ్రి పరంధామయ్యగారు.

"తొమ్మిదిబళ్లు-తోలామండీ." అని తల వంచుకుని అరుగుమీద కూర్చున్నాడు నాగభూషణం.

"చిట్టితల్లీ, ఓవల్టిన్ త్రాగలేదేం యివాళ్ళ?" అంటూ సుమిత్రతల్లి వెండిగాసు పట్టుకొచ్చింది. గ్లాసు అందుకుని నోట్లో పెట్టుకోబోతూ నాగభూషణం వంక చూసి చటుక్కున ఆగింది సుమిత్ర.

పరంధామయ్యగారు యిది చూశారు. ఆయన పకపకనవ్వి, "ఏంతల్లీ? నాగభూషణం లాంటివాడికి యిల్లాటివి డజనైనా చాలవమ్మా. కష్టపడి పనిచేసేవాళ్లకు చద్దన్నం మేలుచేసినట్లుగా మరేదీ చేయదమ్మా." అన్నారు.

నాగభూషణం తలెత్తి సుమిత్రవంక చూసి వెంటనే దించుకుని, సిగ్గుపడుతూ నవ్వాడు. అతని నుదుటినిండా చెమట; కణతలు ఎర్రగా వున్నాయి.

"రారా అబ్బాయి, వడ్డించాను," అంటూ కేకపెట్టింది సుమిత్ర నాయనమ్మ. సుమిత్ర, సీతకూడా మొగవాళ్ళతోనే భోజనాలకు కూర్చున్నారు. ఒకళ్ళిద్దరు బంధువులు, నాగభూషణం వున్నారు అదేపంక్తిలో. సుమిత్ర బామ్మ ఆదరణకు పెట్టింది పేరు.

ఇంకొస్త నేయి వేయనా? వేసుకోరా పిచ్చి నాయనా, పాటుపడేవాడివి" అంటూ లాలనగా ప్రేమగా ఆ ఆశ్రితుడికి ఆవిడ భోజనం పెట్టడం చూస్తే, సుమిత్రలో ఏదో ఆర్ద్రత కలిగింది.

భోజనంచేసిన గంటకల్లా పనికి వెళ్ళిపోయాడు నాగభూషణం. వరండాలో పడక్కుర్చీలో కూర్చుని జీడిపప్పులు తింటున్న సుమిత్రకి దూరంగా పొలంలో కనిపిస్తున్నాడు అతను. గోగునార కాబోలు తీస్తున్నారు. ఎప్పుడో తను ఆ ప్రాంతాలకు వెళ్ళి, ఆవాసనకి డోకొచ్చి వెనక్కి వచ్చేసినట్లు జ్ఞాపకం సుమిత్రకి. కానీ అతను పని చేస్తున్నాడు. పాపం! అనుకుంది. తను ఆ వయస్సుకి హాయిగా ఇంటరు చదువుతూ అల్లారుముద్దుగా పెరుగుతోంది. నా అనే వాళ్లు దగ్గర లేకపోయినా, వల్లవంచి, బాధ్యత స్వీకరించి పనిచేస్తున్నాడు పాపం! సుమిత్ర తల్లి, తండ్రి ప్రత్యేకం పట్టించుకోరు అతన్ని గురించి. పెట్టే తిండికి చేసే చాకిరీకి సరిపోతుందా అని లెఖ్ఖకట్టే వాళ్లు కూడా వున్నారు తన దగ్గరబంధువుల్లో.

"దుక్కలా వున్నాడు, అర్థశేరు తింటాడు" అని సీత తన స్నేహితులతో అంటుంటే విన్నది సుమిత్ర. ఒక్కబామ్మ తప్ప మరెవరూ ప్రత్యేకం ఆదరించి, 'అయ్యో నాయనా' అనరు. ఎవరితోనైనా ఆవిడ అల్లాగే ఆప్యాయంగా మాట్లాడుతుంది.

"పాపం! ఈవయస్సులోనే యిల్లా..." నిద్ర ముంచుకొచ్చి ఆవలించింది సుమిత్ర.

* * *

మూడు నాలుగు రోజులకి కొంచెం నోరెత్తి మాట్లాడ్డం మొదలుపెట్టాడు నాగభూషణం సుమిత్రతో. 'ఏమండీ మంచినీళ్లిస్తారూ' అనో, 'కలం యిస్తారూ' అనో పలుకరించేవాడు. అతను వ్రాస్తుంటే దీక్షగా చూస్తుండేది సుమిత్ర. కరుణ నిండి వుండేది ఆమె చూపుల్లో. ఒకటి రెండు సార్లు నాగభూషణం ఆచూపుని చూశాడు. మొదట్లో సిగ్గుపడుతూ, ఆతర్వాత తమాషాగా నవ్వడం ప్రారంభించాడు.

సుమిత్ర తనవంక చూస్తున్న సంగతి ఎరుగున్నట్లుగా వుండేది అతని ప్రవర్తన. తమాషాగా తల ఎగరేయడం, జుట్టు వెనక్కి త్రోసుకోవడం, గుండీలు సరిచేసుకోవడం — మామూలే! సుమిత్ర పక్కకి తిరిగి నవ్వుకునేది. కుర్రాడు - చేష్టలు ఎక్కడికి పోతాయి! అనుకునేది.

వేసవికాలం-దొడ్లో మల్లెఅంటు ఆవిడు పూర్తిగా ఎండిపోయింది. సుమిత్రకి సాయంత్రంకాగానే మల్లెల వాసనమీదకి మనస్సుపోయేది. తెల్లని మల్లెమొగ్గలు కావాలని కోరిక — రెండుమైళ్ళదూరం పోవాలి వాటికోసం. బిడ్డకోరికలు చెల్లిస్తారు ఆమె తల్లిదండ్రులు. అడిగిందే తడవు అన్నీ వస్తాయి.

మల్లెలు, ఆ సౌరభం, ఆ చల్లదనం తనకు కావాలని — సాయంకాలాల్లో ఆ వాసనని చూస్తూ, ఏదో తీయని వేదనను కలిగించుకోవాలని — అదో ఆరాటం. ఇవన్నీ చెప్పకోదు సుమిత్ర. ఏవైనా సరుకులు కావాలని పక్కగ్రామాలకి పాలేరు పోతుంటే రెండుమాట్లు పూలసంగతి చెప్పింది. పెసలు, కందులు శేర్లతోసహా జ్ఞాపకమున్నట్లుగా




# ★ జీవిత సత్యాలు ★

వీటిసంగతి జ్ఞాపకంవుండదు వాళ్లకి.

నాగభూషణం వెడుతున్నాడు ఒకసారి వెచ్చాలకోసం. వెడుతూ వెడుతూ వరండా లోకి తొంగిచూసి నవ్వాడు. "మల్లెపూలు తీసుకువస్తావా నాగభూషణం?" అనుకో కుండానే అడిగింది సుమిత్ర. చిన్నవాడు కాబట్టి 'నువ్వు' అనవచ్చునని వాళ్ళనాయన నమ్మ చెప్పింది. తలవూపి వెళ్లాడు నాగ భూషణం—

సాయంకాలం వీచే పిల్లగాలులు పెను గాలులై, చిన్న చినుకులు పెద్దవై కుంభ వర్షం—పొద్దుపోయేవరకు కురిసింది.

దోవ అంతా బాగుండదు. తాటితోపులు, దట్టంగా చెట్లు మామూలుగానే చిమ్మచీక టిగా వుంటుంది. ఈ వానలో ఆ దోవ చాలా ప్రమాదకరం. నాగభూషణం రాలే దని ఆరాటపడ్డారు యింట్లోవాళ్లు. పాపం నాగభూషణం తడిసిపోతాడేమో, యీ చీకట్లో, వర్షంలో ఏమైపోతాడో—తెల్ల వారి వచ్చినా బాగుండుననుకుంది సుమిత్ర.

అందరూ భోజనాలు చేసేశారు—ఇంక నాగభూషణం రాడని నిశ్చయించుకుని. 11 గంటలకి వచ్చాడు నాగభూషణం. బట లన్నీ తడిముదలు. పాలేరు కూరలసంచీ పట్టుకుని వణుకుతున్నాడు. వెచ్చాలుమాత్రం కొట్లోనే వుంచివచ్చారుట. సుమిత్రకి వళ్ళు జలదరించింది యీ చిమ్మచీకట్లో ఎల్లా వచ్చారు వీళ్లని.

కూరలన్నీ క్రింద గుమ్మరించి, కాటి 'లోంచి ఏరి, ఒక పెద్దపొట్లం అందించాడు సుమిత్రచేతికి నాగభూషణం. చల్లగా, యుగాల్లాగావున్న అతని వ్రేళ్ళు తగిలాయి ఆమెకి. ఒక్క జలదరింపు! మల్లెపూలు! గుప్పున వాసనవేసింది. తెల్లగా, చల్లగా వున్న పూలు!

"మల్లెపూలు తెచ్చావా?" మృదువుగా వుంది సుమిత్ర కంఠం. నాగభూషణం నవ్వాడు. ఆ చూపు, నవ్వు, అతని స్పర్శ—ఏమిటో—తెల్లని ఆ మల్లెలు సుమిత్ర మన స్సుకి దాపుగాపోయి, ఆమె అనుకున్న కల తలు కలిగించనేలేదు ఆ రాత్రి. ఏదో చిన్న జీర, అపశ్రుతి!

* * *

సుమిత్ర రిజల్ట్సు వచ్చాయి. ఫస్ట్ క్లాసులో ప్యాసైంది. ఇంక పై దేశాలకు పోవడమూ, ఉద్యోగం చేయడమూ—అన్ని సమస్యలు చర్చిస్తున్నారు తల్లిదండ్రులు. ఇంట్లో విశ్రాంతిగా నేవున్నా సుమిత్రకి మాత్రం ఏదో గందరగోళంగా వున్నది వాతావరణం.

నాగభూషణం చద్దన్నం తిన్నా, పొద్దెక్కిన తర్వాత యింటికొచ్చి సుమిత్ర పిన్నితోపాటు • కాఫీ త్రాగుతున్నాడని, పాలానికికూడా ఇస్త్రీ చొక్కా వేసుకు వెడుతున్నాడని—సీత గడగడ చెప్పేస్తోంది మిత్రురాలితో. సుమిత్రకి అన్నీ వినబడు తున్నాయి. కుర్రాళ్ళకి ఏదో చిన్న సర దాలు వుంటాయి. తను చూస్తుండగా, ఏదో చేయాలని ఆరాటపడుతున్నాడు ఆ కుర్రాడు. అందులో సందేహంలేదు. తనని ఆకర్షించాలని—

గులాబిరేకుల్లాంటి ఎర్రని పెదవులు మెల్లిగా విచ్చుకుని, ఆ మల్లె మొగ్గలు కొంచెం కనబడేలా నవ్వుకుంది సుమిత్ర. ఇల్లాంటి వుపమానాలన్నీ అద్దం ముందు నిల్చున్నప్పుడు జ్ఞాపకం రాకతప్పవు సుమిత్రకి—ఆమె పెదవులు, పలువరస— అల్లాంటివే మరి. నిగనిగలాడే తన చేతులని, లేగులాబిలాగా, కొంచెం కందినట్లుగా మెరిసిపోయే తన వేళ్ళకొసలని చూసుకుని అనుకుంటుంది సుమిత్ర—మా వాళ్ళు సుకు మారంగా పెంచారు నన్ను అని.

కుర్రాళ్లకి ఒకానొక వయస్సులో అంద మైన ఆడపిల్లలంటే ఒక వింత ఆకర్షణ వుంటుందని సుమిత్ర అనుకునేది. అది ఒక కుతూహలం! కేవలం పసితనం అనుకునేది సుమిత్ర. నాగభూషణం వయస్సు పద్దెనిమి దేళ్ళు మించదు. ఇతన్ని చూశాక తన అభి ప్రాయాన్ని బలపఱచుకున్నది ఆమె.

కానీ—ఎందుకో అసందర్భంగానే వున్నది అతని ప్రవర్తన.

ఏదో పిండివంటచేయడం మొదలు పెట్టింది సుమిత్ర ఒక మధ్యాహ్నం. జీడి పప్పులు, నెయ్యి అన్నీ విరివిగా ఖర్చుచేసి, తినుబండారం తయారుచేసింది. అందరూ తిన్నారు—బాగున్నదన్నారు. సుమి త్రకి తినాలనిపించలేదు. ఆ పెగ మంచిలేచి, ముఖం కడుక్కొని నెళ్ళి పడు కుంది. వెనకాల సర్దుబాట్లన్నీ తల్లి చేసుకుంది. అలిసిపోయిందేమో మంచినిద్రపట్టింది సుమిత్రకి. సాయంకాలం చల్లబడిన తర్వాత లేచింది. స్నానం చేసివచ్చి, తల దువ్వు కుంటుంటే నాగభూషణం వచ్చాడు.

చటుక్కున జ్ఞాపకం వచ్చి, "అమ్మా, నాగభూషణానికి మిఠాయి పెట్టవే" అన్నది సుమిత్ర.

"నువ్వు కూడా తింటావా?" అన్నది సుమిత్ర తల్లి లోపల్నుంచే.

"ఆఁ" అని జడ అల్లుకోవడం మొదలు పెట్టింది.

"మీరు చేసి, మీరే తినకపోవడ మేమిటి?" అన్నాడు నాగభూషణం.

సుమిత్ర చిలిపిగా నవ్వింది. "నీకోసమే

ఆగాను"-తనల్లా అనడం సమంజసం కాదని వెంటనే తోచింది. అతనిముఖం ఎఱ్ఱబడడం, తన ముంగురులని, చెంపలని అతను మరీ పరీక్షగా చూడడం అన్నీ గమనించింది సుమిత్ర ఏదో పనున్నట్లు అవతలి గదిలోకి వెళ్ళింది ఆమె. నాగభూషణం మిఠాయిని పొగడటం విన్నది సుమిత్ర.

చీకటి పడే వేళ మళ్ళీ మల్లె పూలు వచ్చాయి సుమిత్రకోసం. ఆమె మనస్సు బాగుండలేదు. ఏమిటిదంతా? ఏమైనా వెర్రితనమా అతనికి అనుకున్నది సుమిత్ర.

తన వయస్సు ఇరవై రెండు. అతని వయస్సు మహా ఐతే పద్దెనిమిది! అతనికి పాఠాలు చెప్పగలిగేంత చదువు చదువుకున్నది తను! అతను పెద్ద అందమైనవాడు కాదు; తను అతని పోషకుల బిడ్డ. ఎందుకిల్లా ప్రవర్తిస్తున్నాడు-యితను? కొంచెం అహంకారం అతని స్వభావంలో-ఎందుకనో?

తెలియనితనం కాదని సుమిత్ర గ్రహించుకుంది. ప్రయత్న పూర్వకంగా నాగభూషణం అలా ప్రవర్తిస్తున్నాడు. ఏమి ఆశించి యిల్లా చేస్తున్నాడు? పూర్తిగా అతన్ని నిర్లక్ష్యం చేసే శక్తలేదు సుమిత్రకి.

తెరలాగా అతని ఛాయ వస్తోంది ఆలోచనల్లోకి.

బాగా చీకటి వుండగానే లేచి, స్నానం చేసింది సుమిత్ర. ఆకుపచ్చ చీర కట్టుకుని, జుట్టు ఆరబెట్టుకుంటూ కోరడి దాటి వెళ్ళింది. పద్యాలు చదువుకుంటూ వెళ్ళి చెరువుగట్టున బండమీద కూర్చున్నది. ప్రకృతి అంతా నిశ్శబ్దంగా వున్నది.

చెరువులో చప్పుడై ఉలిక్కిపడింది సుమిత్ర. నాగభూషణం కావడి వేసుకొని వచ్చాడు. బిందె ముంచుతూ తనవంకే చూస్తున్నాడు. అతని చూపులోనే వున్నది ఏదో అహంభావం-సుమిత్రకి మనస్సు బాగుండలేదు. ఏదో విరూపంగా అనిపించి వేరేవేపు చూపు మరల్చింది ఆమె.

కావిడి క్రింద పడేసిన చప్పుడైంది. అడుగుల చప్పుడు తన దాపుకు వచ్చి, తన వెనక ఆగినట్లు విన్నది సుమిత్ర.

చటుక్కున వెనక్కి తిరిగి, "ఏం కావాలి?" అన్నది.

"ఏమీ అక్కర్లేదు." అతను ఖంగారు పడలేదు ఆమె ప్రశ్నకు. ముందుకి వచ్చి, బండె ప్రక్కనే గడ్డిమీద కూర్చున్నాడు.

"చాలా అందమైన కాళ్ళు మీవి." సుమిత్ర చటుక్కున కాళ్లు అవతలికి తీసుకుంది. ఓహో! అనుకుని మనస్సులో, లేని హుందాతనం తెచ్చుకుంది.

"ఐతే ఏమిటి?" అన్నది-

"మీరంటే యిష్టం నాకు." తెల్లగా మొగలిరేకులాగా వున్న సుమిత్రపాదం కొంచెం కదిలింది. చటుక్కున వంగి, చేతులతో ఆ పాదం పట్టుకుని ముద్దుపెట్టుకున్నాడు నాగభూషణం.

"ఛీ!" లేచి నిల్చున్నది. అతని మాటలు వినలేదు, అతని వంక చూడలేదు. అర్థంకాని చీకాకుతో, అసహ్యంతో విసవిస నడిచి యింట్లోకి వెళ్ళిపోయింది సుమిత్ర.

తన పాదంమీద అతని మొద్దుబారిన చేతుల స్పర్శ రోజంతా తెలుస్తూనే వున్నది. ఎన్నిసార్లో కడుక్కుంది సుమిత్ర ఆ కాలుని.

నాగభూషణం ప్రవర్తనతో ఎక్కువ రోజులు చీకాకు పడనక్కర్లేకుండా సుమిత్ర ఆ మరునాడే పట్నం వెళ్ళిపోయింది. నాగభూషణం ఆమె స్మృతిపథంలోంచి మెల్లిగా తొలగిపోయాడు.

* * *

అనర్స్ ప్యాసైన సుమిత్ర ఉద్యోగమూ చేయలేదు, విదేశయాత్రకూ వెళ్లలేదు. ఒక భావుకుని ఆదర్శగృహిణిగా స్థిరపడింది.

ఒకరాత్రి, నీలందీపం కాంతిలో సోఫాలో కూర్చుని చదువుకుంటోంది సుమిత్ర. కాళ్లు పైకి ముడిచిపెట్టుకుని, వెచ్చగా కూర్చుంది. ఆమెభర్త ఆ సోఫాలోనే రెండో మూలకి కూర్చుని ఏదో వ్రాసుకుంటున్నాడు.

"ఏం సుమిత్రా! చలి వేస్తోందా?" అంటూ నవ్వాడతను ఆమె కూర్చున్న తీరు చూసి.

"ఊఁ. కాళ్ళుకూడా చల్లబడుతుంటే."

"ఏదీ చూడనీ" అంటూ పక్కకి వంగి, ఆమె తెల్లటిపాదాల్ని చేతితో స్పృశించి, ఆమె అరికాల్లోనే చటుక్కున ముద్దుపెట్టుకున్నాడు.

సుమిత్ర వారించింది. రెండు సంవత్సరాలనాటి స్మృతులు, సంఘటనలు మనసులో గిరుక్కున తిరిగాయి. అనుకోకుండానే అన్నీ చెప్పింది భర్తకి ఆమె. అల్లాగ అన్నివిషయాలు ఆమెచేత చెప్పించే నేర్పు వున్నది అతనికి మరి.

ఒక్కొక్క సంఘటనే మెల్లిగా జ్ఞాపకం చేసుకుంటూ చెప్పింది సుమిత్ర: "నేను చూపించిన దయని అపార్థం చేసుకున్నాడు అతను. కాకపోయినా నా వయస్సుతో కూడా నిమిత్తంలేకపోయింది అతనికి. అతను అందగాడు కాదు, చదువుకున్నవాడు కాదు. అతనికి అన్నివిధాలా అధికురాలిని నేను. ఏమిటో మరి ఆ పిచ్చితనం! వయస్సు, విద్య రూపం, అర్హత ఏమీ అడ్డంరాలేదు అతనికి. తన అంతస్థు సంగతైనా చూసుకున్నాడు కాదు" సాలోచనగా లైటువంక చూస్తూ కూర్చున్నది సుమిత్ర.

"అలా ఎల్లాగ ప్రవర్తించగలిగాడండీ అతను? ఏమి ఆశించి, అనుకుని అల్లా చేశాడు?" అన్నది భర్తవేపు చూస్తూ సుమిత్ర.

అతను నవ్వి లేచి నుంచున్నాడు. ఆమె ఎదురుగా వచ్చి, జుట్టుమీద చిటికె వేశాడు.

"ఏమీ అనుకోనక్కరలేదు, ఆశించనక్కర్లేదు. పిచ్చిపిల్లా, అతను మొగవాడు, నువ్వు ఆడదానివి-మిగిలిన విషయాలు నిమిత్తమాత్రాలు!"

అది ఎల్లాగ సాధ్యమౌతుందా అని రాత్రంతా ఆశ్చర్యపోయింది సుమిత్ర. కానీ అదికూడా ప్రపంచంలోని మూలసత్యాలలో ఒకటేమోననుకుని, అర్థంలేని నవ్వు నవ్వి, పడుకుని నిద్రపోయింది. ★

# పాత చెంబు

గడపమీద కూర్చుని కమలమ్మ, చెల్లెలు వరలక్ష్మికి జుట్టు చిక్కు తీస్తోంది.

"తల ఒకరిచేత దువ్వించుకొని ఎన్నాళ్ళయిందో! ఇలా ఎప్పుడో పుట్టింటికి వచ్చినప్పుడు తప్ప, ఏదో తల గబగబా బరుక్కోవడమేగాని, ఎప్పుడూ సరిగా దువ్వుకున్నదే లేదు. ఇప్పుడు నువ్వు తల దువ్వుతోంటే నిద్రవస్తోందే అక్కా!" అంది చెల్లెలు వరలక్ష్మి.

"కాదుటే పాపం! సంరక్షణచేసేందుకు నీవక ఏం పెద్దదిక్కు ఉందే! ఇద్దరం చెరో ఊళ్ళోనూ అయిపోయాం. ఎప్పుడో ఇలా ఏటికోసారి కలుసుకుంటాం" అంది ప్రేమగా అక్క కమలమ్మ. లోపల వంటింట్లోనుంచి తల్లి జానకమ్మ గిన్నెలు, బిందెలు సవరిస్తోన్న చప్పుడు వినిపిస్తోంది.

"పాపం! అమ్మ ఒక్కర్తే చేసుకోవడం. మనం చేసిపెడదామన్నా ఎప్పుడూ మన ఇళ్ళకే రాదాయె. ఊఁ అభిమానం. ఇక్కడ ఉన్నప్పుడైనా కొంత మనం సాయం చెయ్యాలే పాపం" అంది కమలమ్మ.

"మీ పనులు మీరు చేసుకుంటే చాలు, నేను ధన్యురాల్ని. నాకేమీ చేసిపెట్టనక్కరలేదు" అంది తల్లి జానకమ్మ వంటింట్లోంచి నడవలోకి వస్తూ.

వరలక్ష్మి నవ్వి ఊరుకుంది. కమలమ్మ తిరిగి తల చిక్కుతియ్యడంలో మునిగిపోయింది. దొడ్లోంచి చెంబులూ, గ్లాసులూ తోమి తెచ్చి దొడ్డి అరుగుమీద పెట్టింది పనిమనిషి అప్పలమ్మ. "అమ్మగారూ! మరికొంచెం చింతపండు వెయ్యండమ్మా. యేసిందంతా ఈ పాత చెంబుకే సరిపోయింది" అంది అప్పలమ్మ.

అప్రయత్నంగా కమలమ్మ, వరలక్ష్మి ఇద్దరూ ఒకేసారి ఆ చెంబుకేసి చూశారు.

"అటకమీంచి తీయించిందిలాగుంది నా చెంబుని" అంది వరలక్ష్మి ఆ చెంబుకేసి ఆప్యాయంగా చూస్తూ. కమలమ్మ ముఖంలో నవ్వు మాయమైంది.

'అదేమిటే! అది నా చెంబు కాదుటే! మరిచిపోయినట్టున్నావ్. చిన్నప్పుడు తీర్థంలో కొనుక్కున్నాను' అంది కమలమ్మ.

'ఏమో! నాన్నగారు నాకు ఎప్పుడు కొన్నారోగాని, ఎప్పుడూ ఆ చెంబుతోనే మంచినీళ్లు తాగేదాన్ని,' అంది వరలక్ష్మి.

"ఆఁ! నీ మొఖం! అది ఇంకో చెంబు. దీనితో ఎప్పుడూ నేనే తాగేదాన్ని మంచి నీళ్ళు. అమ్మ నన్ను తప్ప, ఇంకెవరినీ ఆ చెంబు ముట్టుకోనిచ్చేది కాదు." అంది కమలమ్మ ఒక్కరవ్వ విసురుగా.

'చాల్లేవే! ఆ చెంబు నాదే. క్రితం సారి వెళ్ళేప్పుడు సామాన్లలో పెట్టుకోడం మర్చిపోయాను. ఈసారేనా పట్టుకెళ్ళాలి. చెంబు చాలా అవసరంగా ఉంది' అంది వరలక్ష్మి దూకుడుగా.

'మంచిదానివే! నాన్నగారు నా కోసం ప్రత్యేకంగా పోతపోయించి చేయించారు దిన్ని. అది నాదే' అంది కమలమ్మ, తను తీర్థంలో కొన్నట్టు చెప్పినమాట మర్చిపోయి.

"అబ్బా! తల అంత గబగబా దువ్వుతావేమే? తల మండిపోతోంది." అని తల బాధగా చేత్తో పట్టుకుంటూ అంది వరలక్ష్మి.

## పాలగుమ్మి సుమతి

"ఏమిట్రోయ్! ఏదో ఘర్షణ పడుతున్నట్టున్నారు" అంది జానకమ్మ వంటింట్లోంచి వస్తూ.

వరలక్ష్మి అందుకుంది 'అదికాదే అమ్మా, ఆ చెంబు నాది కాదు అంటోంది, నే నెక్కడ పట్టికెళ్ళిపోతానో అని.'

'అదేం మాట! బాగానే ఉంది. నీ చెంబు అయితే నువ్వు పట్టికెళ్ళడానికేం? అది నాన్నగారు నాకు కొనిపెట్టారు అని చెప్తున్నాను, అంతే' అంది కమలమ్మ.

'అసినీ. ఈ చెంబు కోసంటే ఈ గొడవ అంతేనూ, ఎవరేనా పట్టుకెళ్ళొచ్చు దానికేం' అంది జానకమ్మ.

'నే పట్టుకెడతానంటేనే, ఇంత ఏడుపు ఎవరికైనా? ఇన్నాళ్లూ అటకమీదపడి ఉంటే ఎవరికీ అక్కర్లేక పోయింది.' అంది గోడతో వరలక్ష్మి.

'ఇంతకీ ఏడుపులు, పెడబొబ్బలూ ఎందుకు? అయినకాడికి కాపరానికంతకూ కొత్తసామాను నేనేకదూ కొనిపించుకున్నాను! ఏదో పాతచెంబేకదా, పట్టుకెడదామని అటకమీదనుంచి దింపిస్తే, ఈ రాద్ధాంతమంతేనూ' అంది ఉక్రోషంగా కమలమ్మ.

"ఆ! ఆ! తమ కాపరానికి ఇంట్లో ఉన్న దుక్కలాంటి సామానంతా తర్లించుకు వెళ్ళిపోతే, ఏదో నా ముఖాన్ని నాలుగు దొప్పలుకొని పారవెయ్యవలసి వచ్చింది" అంది సాగదీస్తూ వరలక్ష్మి.

"బాగుందర్రా వరస! ఎవరి కల్లా వీలో అలా ఇచ్చాము. దానికింత రాద్ధాంతం ఎందుకు" అంది జానకమ్మ ఏం చెప్పాలో తెలియక.

"అదేమరి. కందకి లేనిదురద బచ్చలికన్నట్టు కొని ఇచ్చినవారు ఒకరైతే దుఃఖపడేది ఇంకొకరు. అసలు నేను కూడా వచ్చినప్పుడల్లా అటక ఎక్కి చేతికందిన సామానంతా పట్టుకుపోనుంటే, ఈ మాటలు రాకనే పోను" అంది వరలక్ష్మి.

"మాశావా! మాశావా! ఏడుపు ఎవరిదే! ఇప్పుడు చూడవే అమ్మా. వచ్చుడి పెట్టుకు



# పాత చెంబు



...కేందుకు ఏమీ లేదని మొన్న వచ్చినప్పుడు తెచ్చిపెట్టుకొన్నాను, కాదుటే! అందుకు ఈ మళ్ళుంటాను. ఈసారి వచ్చినప్పుడు అది తీసుకొచ్చి మొహాన్న కొట్టేస్తాను. నాకేం అక్కర్లేదు. మేమే కొనుక్కోగలం. నువ్వే పట్టుకెళ్ళొచ్చు" అంది ఉడుకుమోతుతనంగా కమలమ్మ.

"అక్కడికి మేమే కొనుక్కోలేముకదూ పాపం! మామీద దయతలచ నక్కరలేదులే. ఆ రాచ్చిప్ప నువ్వే ఉంచుకో పాపం" అంది వరలక్ష్మి. తిరిగి అమాటే సాగదీస్తూ కమలమ్మ అందుకుంది.

"నువ్వే ఉంచుకో పాపం! ఉంచుకోమనేందుకు, వద్దనేందుకు ఈ యింట్లో తమ పెర్మిషన్ ఎవరికీ అవసరం లేదులే" అంది కమలమ్మ, తల చిక్కుపూర్తిగా తియ్యకుండానే దువ్వన్న అక్కడే పడేసి లేస్తూ.

"అవునవును, నేను, నా మొహం ఇక్కడెవరికీ అక్కర్లేదు. మీరంతా ఒకటి. నేనే పరాయిదాన్ని. రాక రాక ఇన్నాళ్ళకు పుట్టింటికి వస్తే, ఎవరిసొమ్మో పట్టేసినట్టు ఏడవడం. నేనేం గతిలేక రాలేదులే. ఆ పడి తినేదేదో మీకే పడితినవచ్చు" అంది ఏడుపు ముఖంతో వరలక్ష్మి.



"ఆ సమానం ఏడుపూ, ఏడుపూ అంటావేమిటే, చిన్న అంతరం, పెద్దంతరం లేకుండా" అని గద్దించింది జానకమ్మ.

"అవును, నేను రావడమే పొరపాటయింది. ఇక్కడకొచ్చి మీ ఎస్టేటులన్నీ తినేస్తున్నాను తిండిలేక. నేను రేపు ప్రొద్దున రైలులో వెళ్ళిపోతాను. ఇంక ఇక్కడ ఒక్కరోజు ఉండను. నువ్వే ఎప్పుడేనా వచ్చి అక్కడ ఉండు నాలుగురోజుల పాటు. పండక్కు నాకోసం కొన్న చీరా అదీ నీ యిష్టం వచ్చిన వాళ్ళకి ఇచ్చేసెయ్యి" అంది గబగబా జడ అల్లేసుకుంటూ వరలక్ష్మి.

"నేనుమాత్రం ఈయింట్లో ఒక్కక్షణం ఉంటానా ఏమిటి? చూడవే అమ్మా; ఆనక నన్నేమీ అనవద్దు. రేపుప్రొద్దున్న ఫస్టుబస్‌కి నేపోతాను" అంది విసురుగా లోపలికి పోతూ కమలమ్మ.

"ఇదేం ఖర్మమ్రా! పండక్కి ఉండకుండానే వెళ్తారుట్రా! అయ్యో, మీ అత్తారువాళ్ళు ఏమనుకుంటారే! మీ అత్తగారు అసలే తప్పులుపట్టే మనిషి. ఏదో అక్కచెల్లెళ్ళు మాటామాటా అనుకున్నారనుకోరు. నామీద పడతారు. కమలం! నామాట వినవే" అని జానకమ్మ బ్రతిమాలుతోన్నకొద్దీ కమలమ్మ బిగిసిపోయింది.

"ఒసేవ్ చిన్నదానవ్. కొస్త నా మాట వినవే..." అని బ్రతిమాలించుకొన్న వరలక్ష్మి కూడా తనేం తక్కువఅన్నట్టు అసలు నేను భోజనమే చెయ్యనని మంచంఎక్కి ముసుగు పెట్టేంది. కంచందగ్గర కూర్చున్న కమలమ్మ తనకి తలనొప్పిగాఉందని లేచిపోయింది. ఉసూరుమంటూ జానకమ్మ చెంగుపరచుకొని నడవలో నడుంవాల్చింది.

ఇంతగొడవకీ కారణంఅయిన చెంబు మాత్రం పదలం చింతపండూ తనమీద అరగదీయించుకోడంవల్ల, చీకట్లో మెరుస్తూ దొడ్డి అరుగుమీద కూర్చుంది. మొత్తంమీద చెంబు లోపలపెట్టడంఆపరిస్థితులలో ఎవరికీతట్ట లేదు.

చెంబు ఎవరిది అనే సమస్య, ఆ చెంబుకి కొదలచిన కొత్త యజమాని తీర్చేకాడు.

ప్రొద్దున్నే లేచి జానకమ్మ చెంబుకోసం ఇల్లంతా గాలించింది. ఆఖరికి గుర్తొచ్చింది. దాన్ని ఇంట్లో పెటలేదని. ఆవిడ 'అయ్యో, అయ్యో' అంటూంటే నిద్రలోంచి వరలక్ష్మి లేచి 'ఏమిటే అమ్మా' అని అడిగింది.

"ఏమిటేమిటి! రాయిలాంటి చెంబుకి కాళ్ళొచ్చాయి. ఎవళ్ళకు వాళ్ళు ఊరుకున్నారు. అది నాదంటే, నాదని పోట్లాడుకోడం తప్ప, వస్తువుని జాగ్రత్తపెట్టుకోడం లేదు. రాయిలాంటి చెంబు, ఎన్నేళ్ళయిందో! చిదర్లొంది. అయ్యో! ఎవడికళ్ళు పడ్డాయో!" అని వాపోవడం మొదలెట్టింది జానకమ్మ.

"ఏమిటే అమ్మా ఈ హడావిడి" అంటూ



# పకపకలు

## తండ్రులూ - కొడుకులూ

తండ్రి: నీ చదువంతా పూర్తి అయిందికదా! ఇప్పుడు ఏం చేద్దామనుకుంటున్నావురా?

కొడుకు: ఆస్తి పంచుకుందామనుకుంటున్నాను.

* * *

తండ్రి: కాలేజిలో చేరిన తర్వాత లేజినెస్ జాస్తయిందేమిరా?

కొడుకు: అసలు కాలేజిలోనే, లేజి ఉన్నదండి.

* * *

కొడుకు: దుబారాఖర్చు అంటే ఏమిటండీ నాన్నగారూ?

తండ్రి: నాకు బాగా తెలియదు. మీ అమ్మను అడుగు. ఆవిడకు బాగా అనుభవమున్నది.

తండ్రి: రోజూ పదిరూపాయిలు ఖర్చు మాత్రం కనిపిస్తున్నది! ఏమిటిరా నీవు చేస్తున్న వ్యాపారం?

కొడుకు: ముక్కు కలవటం లేదుగాని, లేకపోతే నన్ను ఈ విధంగా మీరు నిలదీసి అడిగిఉండేవారా?

* * *

తండ్రి: ఇన్నిసార్లు పరీక్ష తప్పినా నీకు కనీసము సిగ్గుకూడా లేదే! మన ఎదురింటి అమ్మాయి సరళ చూడు ఫస్టు క్లాసులో ప్యాసయింది!

కొడుకు: మరి ఆ అమ్మాయి ప్యాసయినా నన్ను చూచినప్పుడల్లా సిగ్గుపడుతుందేం?

తండ్రి: ఆపని చేయొద్దని నీకెన్నిసార్లు చెప్పానురా?

కొడుకు: ఏమో! నేను లెక్కపెట్టలేదు.

* * *

తండ్రి: నోటి లెక్కల్లో నీకు సున్నా మార్కులు వచ్చాయట! అన్ని లెక్కలు చేశానని చెప్తావేం? సమాధానాలు ఎందుకు చెప్పలేదు?

కొడుకు: అన్నీ నోట్లోనే ఉన్నాయండి.

* * *

కొడుకు: చదివి చదివి విసుగు పుడ్తున్నది.

తండ్రి: అవునుమరి! నాల్గేళ్ళనుంచి చదివినదే చదువుతుంటే విసుగుపుట్టదూ?

 ఎల్. వెంకటేశ్వర్లు 

మలమ్మ వచ్చింది కళ్ళు నులుపుకుంటూ.

"అవును మీకు మా దావిడిలాగే ఉంటుంది. విశేషంలాంటి చెంబుకు రెక్కలొచ్చాయి." అంటూ జానకమ్మ బాధపడటం మొదలెట్టేంది.

"ఊఁ! పోనిద్దూ, పాతచెంబు పోతే పోయింది" అంది నిర్లక్ష్యంగా కమలమ్మ.

"పాతదా! ఒక్క సొట్టయినా లేదు... ..."అని ఇంకా చెప్పబోతుండగానే

"పోదూ! చచ్చిన వాడికళ్ళు చారెడేసట; నాలుగు రూపాయలు పడేస్తే, దాని తాత మరోటి దొరుకుతుంది" అంది వరలక్ష్మి.

ఏదో చెపుదామనుకుని నోరు తెరచిన జానకమ్మ ఏం చెప్పాలో తెలియక అల్లాగే వట్టింట్లోకి వెళ్ళిపోయింది.

కమలమ్మ వరలక్ష్మికేసి చూసి నవ్వింది. 'అబ్బే! పెద్దదవుతున్న కొద్దీ, ఈవిడకి చాదస్తం ఎక్కువవుతోందే'అంది కమలమ్మ.

'వెధవ చెంబు పోతే ఇంత రాద్ధాంతం చెయ్యాలా! ఎల్లాగయినా ఈ పెద్దవాళ్ళకి శాపీనం ఎక్కువే' అని సమర్థించింది వరలక్ష్మి.

ఓ గంట పోయాక, కొబ్బరినూనె సీసా, దువ్వెన్న తీసుకొని గడపమీద చతికిలబడుతూ, "మొహం త్వరగా కడుక్కొని రావే తల దువ్వుతాను" అని కేకేసింది కమలమ్మ చెల్లెల్ని. 

# శ్రీకృష్ణ జన్మస్థానం : అ

## అనుకున్నా
## అయిం



శ్రీ ఆమంచర్ల



ర చ యి త

**అ**వును! నిజం! అది 1921. గాంధీమహాత్ముని శంఖారావం దేశమంతటా ప్రతిధ్వనిస్తున్నది. సహాయ నిరాకరణం చెయ్యాలి; ఖద్దరు ధరించాలి; రాటం వడకాలి; స్వదేశీ వస్తువులనే వాడాలి; కోర్టులు మూసేయించాలి; స్కూళ్ళన్నీ పాడు పెట్టాలి; ఇంకా అనేక విషయాలు!

నేను అప్పుడు నాలుగో ఫారం చదువుతున్నాను. గాంధీమహాత్ముని కంఠధ్వని నా చెవులకు అదో సంగీతంలా వినిపించింది. నాకే కాదు, మా స్కూల్లో అందరి విద్యార్థులకు కూడా. మాట్లాడితే సమ్మె; ప్రతి వారం కనీసం ఒకటి రెండు సమ్మెలైనా సాగించడం మామూలైంది.

రోజుకొక నాయకుడు మా వూరొచ్చేవాడు. సాయంత్రం భజన, లెక్చరు. విద్యార్థుల మందరం ఆ లెక్చరుకు హాజరు. గాంధీ మహాత్మకు జై! వందే మాతరం! అనే నినాదాలతో ఆకాశం చిల్లులుపడేది. సభలకు వచ్చిన వాళ్ళందరి దగ్గరనుంచి విదేశీ వస్త్రాలు వసూలు చేసేవాళ్లం. ఆనాడు దేశమంతా ఖద్దరు అనే శబ్దమేగాని, నిజానికి ఖదరెక్కడా లేదు. ఏ బట్టయినా సీమ బట్టే. వసూలుచేసిన వస్త్రాలన్నిటినీ పెద్ద కుప్పగా వేసేవాళ్లం. వెంటనే పెద్ద మంట! మేమందరం చేరి గాంధీమహాత్మకు జై! అని అరిచేవాళ్లం. ఆ కుప్ప భగభగ మండిపోతూంటే ఆనందంతో నాట్యం చేసేవాళ్లం.

ఒకనాడు చీరాలనుంచి ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు మా వూరికి వచ్చారు. ఆయనతోపాటు చండ ప్రచండులైన భట్టిప్రోలు సూర్యప్రకాశరావు, గౌసు బేగ్ సాయెబు మొదలైనవారు కూడా వచ్చారు. ఆనాటి మీటింగు ఒక పెద్ద యజ్ఞం. గోపాలకృష్ణయ్యగారన్నారు. "జైళ్ళంటే భయంలేదు. జైలు కృష్ణ జన్మస్థానం. అక్కడికి పోతే కాశికి పోయిన దానికంటే ఎక్కువ పుణ్యం." ఇలాగే ఇంకా అనేక సంగతులు చెప్పారు. నిజంగా ఆయన ఆనాడిచ్చిన ఉపన్యాసం అమోఘమైనది. ఆయన మాటలతో మా గుండెలు ఉత్సాహంతో ఉప్పొంగి నాట్యం చేశాయంటే నమ్మండి. ఇంతలో ఒక కుర్రవాడు లేచి, "మీరు స్కూళ్ళు చాలించమంటారు. స్కూళ్ళు చాలించి ఏం చెయ్యాలి?" అని ధైర్యంగా ప్రశ్నించాడు. "బసుద్దాయిల లాగ తిరగండి" అన్నాడు దుగ్గిరాల. "బ్రిటిష్‌వాణ్ణి వెళ్లగొట్టాలంటే ఇలాంటి వాళ్లు అనేకమంది కావాలి," అని కూడా అన్నారు.

అంతే! మరుసటి రోజే నేను స్కూలు మానేశాను. ఇంట్లో అమ్మ, నాన్న కొంత రాద్ధాంతం చేశారు. అప్పటిలో వాళ్ళ మాటలు నాకు లెక్కేమిటి! స్కూలు చాలించాను; సీమ బట్టలన్నీ తగల పెట్టాను.'

చివరకు గోచీ తప్ప మరేమీ మిగలలేదు. అది కూడా సీమగుడ్డని నేను బాధపడడం మానాన్న చూశాడు. అదీ విప్పేసి తిరుగుతానుకున్నాడు కాబోలు! బజారుకు తక్షణమే వెళ్లి ఖద్దరువి రెండు చొక్కాలు, రెండు పంచలు తెచ్చి ఇచ్చాడు.

ఇంకేముంది! ఆంధ్రరత్న చెప్పినట్లు జీవితం మొదలు పెట్టాను. నూలు వడకడం, నేత నేయడం, ఖద్దరుగుడ్డ లమ్మడం, ప్రొద్దునే ప్రభాతభేరీలు. నాకు కొందరు విద్యార్థులు తోడయినారు. వాళ్ళు స్కూలు చాలించలేదు. కాని, ప్రభాత భేరీలలో నాకు తోడుగా వచ్చేవాళ్ళు.

గొప్ప కవులు ఆనాడు అనేక జాతీయ గీతాలు వ్రాశారు. ఆ పాటలన్నీ నేనే మయినాయో? కాని, ఆ నాడవి మాకు, దేశానికి అమృతప్రాయాలైనాయి. ఒక పాట రోజూ పాడేవాళ్లం.

"జైలు యన్న మిగుల సుఖము లెందు
వేళకు వేడి వేడి స్నానాలు..."

మిగతా భాగం జ్ఞాపకం లేదు.

జైలు శ్రీకృష్ణ జన్మస్థానం. అక్కడికి వెళ్లాలి. అక్కడ మిగుల సుఖం. అనేకమంది రోజు రోజూ అరెస్టయి జైళ్లకు పోతున్నట్లు వార్తలు వచ్చేవి. మనం ఎప్పుడు వెళ్లతామా అని నా మనస్సు అతిగా ఉవ్విళ్ళూరుతుండేది. మా వూళ్ళో కోటేశ్వరరావునాయుడుగారు సబిన్స్పెక్టరు. ఎప్పుడు నన్ను అరెస్టు చేస్తావని ఆయన్ని రోజూ అడుగుతుండే వాణ్ణి. ఆయన నవ్వి: "ఆ టైము కూడా వస్తుంది లేవోయి" అనేవాడు.



# నాటి అనుభవాలు




ఎన్ని కేకలు వేసినా, ఎన్ని విదేశీ వస్త్రాలు తగులపెట్టినా జైలుకు వెళ్ళడంనాకు తటస్థించేట్లు కనిపించలేదు. నేను చిన్నవాడినని వీళ్లు లెక్క చేయడం లేదనిపించింది. కోపంకూడా వచ్చింది. ప్రభుత్వాన్ని ఇంకా ఎక్కువగా రెచ్చ కొడదామనుకున్నాను. రోజూ ప్రొద్దున్నే పోలీసు లైన్లలోకి వెళ్లి ప్రభాత ఫేరీలు చేయడం మొదలుపెట్టాను. వాళ్ళను ఉద్యోగాలకు రాజీనామా ఇవ్వమని ప్రబోధించాను. ఇకనైనా తప్పక అరెస్టు చేస్తారని నమ్మాను.

రెండు మూడు రోజులయింది. ఆ వూరి కానిస్టేబుల్సందరూ ఒకనాడు నాకు ఎదురై ఇట్లా అన్నారు. "అబ్బాయి, నీవు మంచి వాడివి. నీవుఇట్లాచేస్తే నిన్ను ప్రభుత్వంఅరెస్టు చేయవచ్చు, చేయక పోవచ్చు. కాని మా



ఉద్యోగాలు మాత్రం పోతాయి! నీలాంటి పిల్లలు మాకూ ఉన్నారు. మా ఉద్యోగాలు పోతే వాళ్లు ఎలా బ్రతుకుతారు చెప్పు?" ఈ విధంగా చాలా బ్రతిమాలుకున్నారు. వాళ్ళు చెప్పేదీ నిజమే అనిపించింది. అందుచేత వాళ్ల లైన్లలో ప్రబోధం మానాను. కాని ఎలా కృష్ణజన్మ స్థానానికి వెళ్ళడం?

ఎన్నో విధాల ప్రయత్నించాను. కాని అరెస్టు కాలేదు. ఇంతలో పుట్టి మునిగినట్లు గాంధి నాన్ కో ఆపరేషన్ ఆపించేశాడు. ఏమని చెప్పను నా ఆశాభంగం!

* * *

**1929** వచ్చింది. బి. ఏ. చదువుతున్నాను. గుంటూరులో యూత్ లీగు స్థాపించాము. మేము ముప్ఫయిమంది యువకులం. దేశ స్వాతంత్ర్యం సాధించాలన్నదే మా పట్టుదల. ప్రతివారం మా లీగ్ ఆఫీసులో మీటింగు. దేశకాల పరిస్థితులన్నీ మన పార్లమెంటులోకంటే హెచ్చు స్థాయిలోనే చర్చించేవాళ్ళం. ప్రతి కొన్ని రెన్నాళ్ళకు, వ్యాలంటీర్లుగానో, మరో తీరునో తప్పక తయారౌతుండే వాళ్ళం. "గాంధీ మహాత్మకు జై, భారత్ మాతకు జై, డౌన్ డౌన్ విత్ ది బ్రిటిష్" అనే కేకలు మా గొంతులు చిల్లులు పడేలాగ వేసే వాళ్ళం. ఎవరయినా సరే, ఖద్దరు కట్టుకోకుండా కనిపిస్తే చాలు, వాడి భరతం పట్టామన్నమాటే.

ఇంతేగాదు. ఆనాడు గుంటూరు జిల్లా కాంగ్రెసు కమిటీ కార్యక్రమాలతో ఏకీభవించాము. వాళ్లతో ప్రతి చోటికీ, ప్రచారానికని, దానికని, దీనికని, అన్నిటికీ మేము తిరుగుతుండే వాండ్లం.

ఆంధ్రలో గాంధి మహాత్ముని పర్యటనం వచ్చింది. గుంటూరు జిల్లాలో, ఆయనతో, ముఖ్యంగా, మేం ముప్ఫయిమంది తిరగ దలచుకున్నాం. ఆనాడు జిల్లా కాంగ్రెసు కమిటీకి ఒక కారుండేది. ఒక పేటు దాన్ని దానం చేశాడు. అలాంటికారు ఈనాడు కంచుకాగడాలతో వెతికినా దొరకదనుకుంటాను.

టైర్లలో ట్యూబులు, గాలీ లేవు. గడి పక్కి నడిపించేవాళ్లం. పంచర్ పడుతుందనే భయం లేదు. ఆకారుకు పెట్రోలు అనవసరం. కిరసనాయిలు పోసి నడిపేవాళ్ళం. దానికి బ్రేకులు, మొదలయినవి కూడా ఉండేవి కావు. అది స్టార్టు కావడానికి ఒక ఫర్లాంగు మేర నెట్టాలి. సడెన్‌గా స్టార్టు అయ్యేది. ఎగిరి ఎక్క గలిగిన వాళ్ళం ఎక్కేవాళ్ళం.— మిగిలిన వాళ్ళం దిగబడిపోయే వాళ్లం. అందులో బాగా సత్తువ కలవారు నడిచో లేక మరోవిధంగానో సాయంత్రానికి మరో గ్రామంలో మమ్మల్ని కలుసుకునేవాళ్ళు. ఆనాటి ఉత్సాహం అలాంటిది! నిజంగా వాళ్లు ఆవిధంగా మమ్మల్ని కలుసుకోవడం కూడా చాల అవసరమే. ఎందుకంటే మళ్ళీ ఆ వూళ్ళో కారు స్టార్టు చేయడానికి యోధులు కావద్దూ!

ఈ కారు ఆపడంకూడా ఒక ప్రహసనమే. ఎందుచేతనంటే, చీరాలలో బ్రేకులు వేయడం మొదలుపెడితే, అది బాపట్లలో ఆగేది. అందుచేత, ఆగవలసినస్థలం రెండు మూడు మైళ్లుండనగానే, డ్రైవరుఇంజనాపేసి బ్రేకులువేయడం మొదలుపెట్టేవాడు. తిన్నగా వెళ్ళి అవసరమైన చోటుకు ఒక ఫర్లాంగుదూరంలో అది ఆగేది. ఆరోజుల్లో మాకు ఒకఫర్లాంగు లెక్కా...!'

కాని ఒకొక్కప్పుడు అవసరంగా ఈ కారు ఆపవలసివస్తే ఏంచేసేవాళ్ళని కొంతమందికి సందేహం రావచ్చు. ఆనాడు మాకది అంతప్రమాదకరమైనదిగా తోచేది కాదు. అంత అవసరమైనప్పుడు, ఏ చెట్టుకో, గుట్టకో మా డ్రైవరు కారును ఆనించేవాడు. అప్పుడది చచ్చినట్టు ఆగేది! చెట్టూ, గుట్టా లేనిచోట మైదానంలో గుండ్రంగా గిర్కులు తిప్పించి ఎప్పుడో ఒకప్పుడు కారు ఆపేవాడు.

ఈ బ్రేకులులేని కారువల్ల రోడ్లలో వచ్చేవాండ్లకూ ఏ ప్రమాదం ఉండేదికాదు. కారులోవున్న మా జనం చేసేనినాదాలకు, కారు సంగీతానికి సామాన్యంగా జంతువులన్నీ ఒకమైలు వరకు చెల్లాచెదరయ్యేవి! ఇక మనుష్యులసంగతి చెప్పనక్కరలేదు!

ఏదో ఒకకారు మా పాలిటపడ్డది. అదే చాలు మాకు. నిజంగా ఉత్సాహంమీద వరిగత్తేవాళ్ళకు అసలు కార్లెందుకు!

# అనుకున్నదొకటి! అయింది మరొకటి!

గాంధిగారిని ఇలాఅనుసరిస్తూ, గుంటూరు జిల్లా అంతా పర్యటనచేశాము. ఒకవిషయం చెబితే అందరూ నమ్మకపోవచ్చు. ఈ రోజుల్లో జీపులుసైతం వెళ్ళలేని గ్రామాలు గుంటూరుజిల్లాలో అనేకం ఉన్నాయి. అవన్నీ ఆకారుమీదనే తిరిగాము. మాకారు కష్టేమిటి? అథవా, ఎక్కడయినా కారు మొండికిపడ్డదా దాన్ని మేమేమోసేవాళ్ళం.

నిజంగా మేము వెళ్లిన ప్రతి ప్రదేశానికి ఆనాడు గాంధిమహాత్ముడు రాలేదు. రావా లనుకున్నా రాలేదు! మా కారు వెళ్ళిన చోట్లకల్లా, ఆయనగారెక్కిన కారు కారెలా రాగలదు?

ఆయనగారికారు నేడు మనకు కన్పించే కొల్లమో స్తరు అంత నాజూకయినదికాదు. ఎందుకంటే రేపల్లెతాలూకాలో అనుకుంటాను; రాత్రి పదకొండు గంటలయివుంటుంది. మా కారు ముందేవచ్చి అక్కడ ఆగిపోయింది. మేమింకా దాన్ని నెట్టే ప్రయత్నంలోనే వున్నాము. ఇంతలో గాంధీగారి కారు కూడా వచ్చి అదీ ఠపీమని ఆగిపోయింది. గాంధిగారు కారులో నిద్రపోతున్నారు.

ఆయన నిద్ర లేవకుండా ఆయనకారును ముందు దాటించేద్దామనుకున్నాము. దాన్ని నెట్టడం మొదలుపెట్టాం. ఇంతలో ఆయన నిద్ర లేవనేలేచారు. దిగి నేనూ కారు నెడతానన్నాడు. మేము నిజంగా బిత్తర పోయాం! ఏమంటే వారి కారును మేము నెట్టాలిగాని, ఆయన నెట్టడమేమిటి? మహాత్ముడు కారులోనే ఉండాలి; దాన్ని మేము నెట్టాలి. అదీ మా పంతం.

కాని వద్దంటే ఆయన ఒప్పుకోలేదు. మీతోపాటు నేనూ నెట్టాల్సిందే నన్నారు. చాలా బ్రతిమాలుకున్నాం. మా కందరికీ ఏడుపొచ్చినంత పని అయింది. చివరకి ఆయన మామీద దయతలచి, "సరే, మీరే నెట్టండి. కారు కొంతదూరం కదిలేవరకూ నేను నడుస్తాను" అని అన్నారు. మహాత్ముడు కారులో కూచుంటే, దాన్ని నెట్టాలని మా ఆశ. కాని ఆయన ఒప్పుకోలేదు. నిజంగా వలభైకోట్ల ప్రజలుగలిగిన దేశాన్ని ముందుకు నడిపిస్తున్న గాంధిని నెట్టగలశక్తి ఎవరికుంది? అయినా సరే, మాకుకొంత సంతోషం కలిగింది. మహాత్ముడు కనికరించి, కారును నెట్టకుండా నడిచారు. ఆనాటి కంతే చాలనుకున్నాము.





ఇలాగా ఆ పర్యటన సాగిపోయింది. నిజంగా మేము ముప్ఫయిమందిమి బ్రిటీషు వారితో సంగ్రామ మెప్పుడెప్పుడా అని కాచుకు కూచున్నాం.

* * *

**1930** రానే వచ్చింది. గాంధి ఉప్పు సత్యాగ్రహం అన్నారు. ఇది నిజంగా బ్రిటిష్‌వాళ్ళతో యుద్ధమే. మేం ముప్ఫయిమంది యుద్ధరంగంలోకి జొరబడ్డాం.

అప్పటికి మాగురువు అన్నాప్రగడ కామేశ్వరరావుగారు; మా కందరికీ కర్రసాము మొదలయినవి నేర్పారు. మాలోకొంతమందికి మాత్రం పిస్తోలు, తుపాకి కాల్చడంకూడా నేర్పారు. నేను, మా గురువుగారు ఒకనాడు ఇలా అనుకున్నాం. "ఇది నిజంగా యుద్ధమే. దేశానికి స్వతంత్రం వచ్చేవరకూ ఇది ఆగదు. పోలీసువాళ్ళు అత్యాచారాలు చేస్తారు. మనం వాళ్ళ ఎదుటపడకుండా వెనక నక్కి, అత్యాచారాలు చేసిన పోలీసు వాళ్ళని, దొరలని హతమార్చాలి. అప్పుడు వాళ్ళంటే భయం దేశంలోపోతుంది. స్వరాజ్యం రెండడుగులు ముందుకొస్తుంది."

అంతే, రెండోరోజే చెప్పకుండా, మా గురువుగార్ని అరెస్టుచేశారు. ఆయన గారు కృష్ణ జన్మస్థానానికి వెళ్ళారు. మరి నామాట?

ఇంతలోనే, దేవరం పాడుకు నన్నుంగ వాళ్ళనుకున్న నా స్నేహితులను వెళ్ళమని మా కమాండరు ఉత్తర్వుచేశాడు. నాతో, మంత్రవాది వెంకటరత్నంగారు, తూము లూరు శివరామయ్య, గౌసు బేగు సాయెబు మొదలయినవాళ్లు, పదహారుమందిని జట్టుగా చేసి, దేవరంపాడు పంపించారు. 'ఉప్పు యుద్ధం' చెయ్యమన్నారు.

సత్యాగ్రహంలో జొరబడ్డాం. కాని నన్ను పోలీసులు బాగా ఎరగరు కాబట్టి అరెస్టు చెయ్యరులే, ఇంకా పెద్దనాయకులు ఉన్నారుకదా అనుకున్నా.

అన్నీ మనం అనుకున్నట్టు అవుతాయా? దేవరంపాడులో, మాకూ, పోలీసులకీ జరిగిన యుద్ధం మరువరానిది. నేను, మంత్రవాది, తూములూరు, గౌసు బేగు ఉప్పుపట్టుకున్నాం. ఒక్కొక్కరిని, ఆరుగురు పోలీసులు చుట్టుముట్టారు. గింజుకున్నా ఉప్పు వారివశం కాలేదు! మమ్మల్ని కొట్టారు. ముళ్ళకంపల లోకి ఈడ్చారు. ఏం లాభం? మొండివాడు రాజుకన్న బలవంతుడు! ఉప్పు మాచేతుల లోనే ఉంది. విసుగుపుట్టి వాళ్ళు మమ్మల్ని వదిలేశారు. ఇట్లా ఎనిమిదిరోజులు అక్కడ ప్రతి ఉదయం బ్రిటిషువాళ్ళతో యుద్ధం జరిగేసరికి గ్రామంలో ప్రజలుకూడా పోలీసులకు ఎదురు తిరిగారు. అప్పటిదాకా చప్పగా వున్న గ్రామాలన్నీ ఒక్కసారి రేగిపోయినాయి. అక్కడా అనేక అరెస్టులు చేయడం మొదలుపెట్టారు.

పని అయింది కాబట్టి గుంటూరుకి వెంటనే రమ్మని శిబిరం కమాండరు ఆజ్ఞాపత్రం పంపాడు. అరెస్టు కాలేదుగదా! అనుకున్నా.

గుంటూరు చేరామోలేదో నన్నూ గాలిబు సాహెబు మళ్ళీ దేవరంపాడువెళ్లి, అక్కడి

సంగతిసందర్భాలు కనుక్కొని రమ్మన్నారు. వెళ్ళాం. అంతే పోలీసులు అరెస్టు చేశారు మమ్మల్నిద్దరిని.

* * *

శ్రీ కృష్ణజన్మస్థానానికి పోతున్నాం కదా అనుకున్నాం. అక్కడ ఎంతో సుఖం. "వేడి వేడి స్నానాలు, వేళకు భోజనాలు", అన్న పాతపాట జ్ఞాపకానికి వచ్చింది. ఆ రాత్రికి నన్నూ, గాలీబును ఒక చిన్న హోటలుకు పోలీసులు భోజనానికి తీసుకెళ్ళారు. అక్కడ భోజనం బాగులేదు. జైలుకు వెళ్తున్నాం కదా, అక్కడ హాయిగా భోజనం చేయొచ్చులే అనుకొని నేను హోటలులో భోజనం చేయలేదు.

రాత్రి ఒంగోలు రైలుస్టేషనులో నేను గాలీబు, పోలీసులు పడుకున్నాం. ఖాళీ పొట్టతో నిద్ర పట్టలేదంటే నమ్మండి. ఓసి ఇంతేగకదా! మర్నాటి సాయంత్రానికి ఎలాగూ కృష్ణ జన్మస్థానం చేరుతాం. అక్కడే మన భోజనం. నిజంగా అదొక స్వర్గం కాదూ! ఇలా ఏవేవో ఆలోచిస్తున్నా. ఇంతలో తెల్లవారింది. నలుగురం కాఫీ తాగాం. రైలు రాగానే ఎక్కాం.

ఆపెట్టెలో చాలమంది ఉన్నారు. వాళ్ళకి మాతో మాట్లాడాలనే ఉంది. కాని నాటి పరిస్థితులనుబట్టి కొంచం జంకారు. వాళ్లను అరెస్టు చేయవచ్చు; లేక రెండులాఠీ దెబ్బలయినా పడవచ్చు. ఎలాగయితేనేమి? ఒక బెంచీ ఖాళీచేసి మాకిచ్చారు. అటాగే ప్రయాణం చేశాము.

బెజవాడస్టేషన్‌లో భోజనం చేదామనుకున్నాం. కాని పోలీసులవద్ద గవర్నమెంటు వారిచ్చినబత్తా, నలుగురి భోజనానికిచాలదు. అందుచేత నేను, గాలీబు కాఫీమాత్రం తాగాము. పోలీసులు సుష్టుగా భోజనం చేశారు. నాకూ గాలీబుకు భయమేమిటి? ఆ సాయంత్రానికే కృష్ణజన్మస్థానంలో విందుకదా!

సరిగా సాయంత్రం రాజమండ్రీ జైలుకు చేరాం. పోలీసుల లారీయే స్టేషన్‌నుంచి మమ్ములను తీసికెళ్లింది. లారీ తలుపులు పూర్తిగా మూయడంచేత ఊళ్ళోఎలాగుందో మేము చూడలేదు. అయినా ముందు భోజనం చేయాలి. ఆకలేస్తున్నది.

రాజమండ్రీజైలులో మమ్మల్ని, పోలీసులు జైలు అధికారులకు అప్పజెప్పారు. తీర్చిన తోటలు, మంచి పూలచెట్లు, దిద్దినగోడ్లూ, అదంతా చాల అందంగా ఉంది. ఇంత అందమయినప్రదేశానికి రావటానికి జనం ఎందుకు భయపడుతారా అనిపించింది. నిజంగా నేను నాటివరకు మాచిన ఏ బంగళా అంత శోభాయమానంగా లేదంటే నమ్మండి.

మమ్మల్నిద్దరిని "కారంటైన్" లో చేర్చారు. అది "కోరంటీకం" అని జైలులో ఉన్నవాళ్ళన్నారు! ఇంగ్లీషుపదాలకుకూడా వికృతి ఏర్పడుతుంది. సరే అప్పటికి దాదాపు ఏడుగంటలయింది.

"శ్రీమతి" ఎదురయినాడు మిగిలినవాళ్లందరూ అప్పటికే లాకప్పులోకి చేరారు. చాల ఆప్యాయంగా "శ్రీమతి" మమ్మల్నిద్దరిని హెచ్చరించాడు:

"మీరా వచ్చింది. ఎవరో ఇద్దరు వస్తున్నారని పులుసు, అన్నం వుంచాం. అదితిని మీ "సెల్స్" లోకి పొండి," అని తన లాకప్పులోకి వెళ్లాడు.

పులుసేమిటి? అన్నమేమిటి? అదీ వద్దిది! నేను వెంటనే, ఆలోచించాను. రేపునుంచి భోజనం చేయవచ్చులే అనుకున్నాను. నాకు ఇప్పుడు భోజనం వద్దులే అని నా 'సెల్'కు పోయినాను. "శ్రీమతి" తన సెల్లులోనించి నన్ను హెచ్చరించాడు. కటకటాల వెనకనుంచి నాతో మాట్లాడుతుంటే, అదేదో, జూలోని మృగాలతో మాట్లాడుతున్నట్టుంది! కాని, వున్నవాళ్లందరూ అలాగే ఉన్నారు.

# ★ అనుకున్నదొకటి! అయింది మరొకటి!! ★

శ్రీమతి: "గోపాల్! నీవు చిన్నవాడివి! తెలీదు. అన్నం తిని పడుకో," అన్నాడు. "ఏం ఫర్వాలేదులే" అన్నాను. మనసులో, మర్నాటి విందునుగూర్చే నా ఆలోచన!

అంతే గాలీబు తన 'సెల్' లోకి, నేను నా 'సెల్'లోకి పడ్డాం పడుకోడానికి. ఒక పట్టా, కప్పుకోడానికి ఒక కంబళీ. రెండూ బాగా గుచ్చుకుంటున్నాయి. పైగా వాటి నిండా ఏవో పురుగులు! అవి చూసేసరికి మనస్సుకు అంత ఆనందం కలుగలేదు. అయినా ఇది కొరంటైకమే కదా! రేపు అసలు జైలులోకి పోతాం అక్కడ మంచి వస్తువు లిస్తారులే అనుకున్నాను. నిజంగా అంత అందమయినచోట మంచి వస్తువులు కాక మరే ముంటాయి?

అంతే! ఆ కటకటాల ప్రక్కన కూర్చొని నిద్రపోయినాను.

* * *

తెల్లవారింది. అందరితోపాటు నా కటకటాలనూ వార్డరువచ్చి తెరిచారు. ముఖం కడుక్కోడానికి, అక్కడ నీళ్ళతొట్టి ఉంది. అక్కడే కొందరు స్నానాలుకూడా చేస్తున్నారు "ఇదేమిటి? వేడి నీళ్లు రావా?" అన్నాను. అందరూ నవ్వారు!

నాకేమీ అర్థంకాలేదు. నాకొక డబ్బా ఇచ్చారు. ఇంక కాఫీ వస్తుందిలే అనుకున్నాను. అవును. చూస్తూవుండగానే పెద్ద ఇనపబానను ఇద్దరు మోసుకొచ్చారు. కాఫీ అనుకున్నా. మాడుతున్న కడుపుకింత కాఫీ పడితే, పది గంటలకు భోజనం వస్తుంది ఫరవాలేదనుకున్నా. అది మన కాఫీ కాదు! గంజి! కొంచం ఆశాభంగం కలిగినమాట వాస్తవమే. కాని ధైర్యం కలవాణ్ణి గనుక భోజనాల వేళవరకు వేచివుందా మనుకున్నాను.

మళ్ళీ శ్రీమతి వచ్చాడు. "ఏం గోపాల్ రాత్రికూడా నీవు భోజనం చేయలేదు. గంజి తాగు నామాట విను" అని బోధించాడు. నీకు తెలియదులే అన్నాను.

పదిగంటలకు ఆ తొట్టివద్దనే, అందరితో పాటు స్నానంచేశాను. భోజనానికి అందరు బారులు తీర్చి కూర్చున్నారు. ప్రతి ఒక్కరికీ ఒక కంచం. ఒకడబ్బా వున్నాయి. నాకూ రెండు బొచ్చెలిచ్చారు.

అన్నం వచ్చింది. పెద్దపాడెలాంటి దాని మీద, అచ్చొత్తిన అన్నం ముద్దలున్నాయి! ఆస్పత్రిలో పేషంట్లను మోసేవారిలాగ ఇద్దరు దాన్ని మోసుకొచ్చారు. మరిద్దరు ఒక ఇనుపతొట్టిలో పులుసు మోసుకొచ్చారు. నిజంగా ఆ పులుసు దూరంనుంచే గప్పుని ఒక రకమైన వాసన కొట్టింది. విక్టోరియా హాస్టలు వెనకపక్కనవున్న బకింగుహాము కాలువ జ్ఞాపకానికి వచ్చింది.

ఇదేమిటి అన్నాను 'శ్రీమతి'ని. "అంతే" అన్నాడతడు "ఇదే మనకి రోజూభోజనం. ఆ పాడెమీద వచ్చిన ఒక అన్నపుముద్ద! ఒక గొట్టం ఆ మురుగునీళ్ళు. దాన్ని కాస్తారు లేక వేడిగా ఉంటుంది. జబ్బు చేయదు," అన్నాడు నవ్వుతూ శ్రీమతి.

నాగుండె రెండంగుళాలు కిందికి జారిందంటే నమ్మండి! మా స్నేహితుల ముఖాలన్నీ చూశా. వీరులు! మహావీరులు! వీళ్లందరినీ ఇలా చేస్తారా, బ్రిటిష్‌వాళ్లు? మా గురువుగారిని తలుచుకున్నా. అంతే!

కంచంలో ఆ అన్నంముద్ద, గొట్టంలో ఆ మురుగునీళ్లు నా ముందున్నాయి! అది పులుసుట! ఇదా కృష్ణజన్మస్థానం—అనిపించింది! దుగ్గిరాల ఎంత గొప్పవాడు!

అవును ఇదే కృష్ణజన్మస్థానం! ఆయన అన్న లేడుగురు అక్కడ హతమైనారు! అందుచేత పుట్టగానే అదిచూసి గాబరాపడి కృష్ణుడు బ్రతుకు జీవుడా అంటూ పారిపోయి నందనవనం చేరుకున్నాడు!

శ్రీ కృష్ణ జన్మస్థానం! దీన్ని మరువకండి! ★

# రక్షించిన పూల

(19 వ పేజీ తరువాయి)

వచ్చి పడుకున్నాడు. అర్థాంగి అన్నీ సవరించుకొని, "ఇంతకీ మీకు మావాళ్ళు రావటం యిష్టం లేనట్లుందే" అంటూ వచ్చింది.

"అట్నే యిష్టం లేక పోవడమేమిటి. విజవాడకి మూడులక్షలమంది వస్తారని అంచనా వేయబడింది. ఇక మనింటికి ముప్పైమంది వస్తారని అంచనా వేశాను, అన్నాడు యింటికప్పు చూస్తూ.

"అంతా మావాళ్ళేనా."

"అట్నే, మీ, మా లేదు 'మన' వాళ్ళని" అన్నాడు శేషగిరి.

"అవును. రాక రాక పన్నెండేళ్ళకి వస్తుంది పుష్కరం. మరి నలుగురూ వస్తారు. మా వాళ్ళంతా వస్తారు. వచ్చే పుష్కరాలకి ఎలాగుంటామో మనకి తెలియదుకదా! అంది వాళ్ళమ్మావాళ్ళూ వస్తే వాళ్ళతో కూడ చక్కగా తిరగొచ్చని ఊహిస్తూ. "మా చెల్లెల్ని పెళ్ళయాక చూడలేదు. ఇప్పుడు ఇద్దరు పిల్లలు కూడాను. అదీ వస్తుందట" అంది.

"నా జేబులో రెండుత్తరాలుండాలి చూడు" అన్నాడు.

అర్ధాంగివెళ్ళి జేబులోని ఉత్తరాలు రెండూ తెచ్చి చదివింది. అవి మడిచి పెడుతూ.

"పెద్దవదినా, చిన్నవదినా కూడ వస్తారన్నమాట" అంది.

"అంతే కాదు, మా మేనమామ, మేనత్త కూడా వస్తారు. రేపో, ఎల్లుండో వస్తుంది ఉత్తరం" అన్నాడు శేషగిరి.

"అంతా చాల సందడిగా ఉంటుంది. ఎగ్జిబిషన్ కూడా వస్తుందట" అంది ఉత్సాహంగా.

"ఆఁ అన్నీ వస్తాయి. అన్నీ మనకి కాదు. డబ్బు గలవాళ్ళకి, ఇంతమంది వస్తే ఏలా భరించటం!" అన్నాడు శేషగిరి.

అర్ధాంగి ఆలోచించిందో అయిదు నిముషాలు, "ఎక్కడైనా అప్పు తెండి ఏం చేస్తాం. డబ్బు లేదని వాళ్ళని రావద్దంటామా!" అంది.

"అప్పెవడిస్తాడే మనకి పిడుగులా వచ్చిందే పుష్కరం" అంటూ ప్రక్కకి తిరిగి పడుకున్నాడు శేషగిరి.

"బాగుంది మీ వరస" అని ఎడపిల్ల పక్కలో పడుకుంది—అర్ధాంగి.

* * *

రోజులు దొర్లుతున్నాయి. శేషగిరి మామూలుగా 'రోటీన్' పని చూచుకుంటున్నాడు. ప్రతిరోజూ పేపరు

చూస్తున్నాడు పుష్కరాలని గురించిన కొత్త వార్తలున్నాయేమో చూద్దామని. పేపర్లో ఇన్‌ఫ్లూయింజా వ్యాధిని గూర్చిన వార్తలు మాత్రం కనిపిస్తున్నాయి. ఆరోజు మధ్యాహ్నం పేపరు చూస్తున్నాడు శేషగిరి. "ఆంధ్రలో ఫ్లూ వ్యాధి" ప్రతీ ఊళ్ళోని వివరాలూ చూస్తున్నాడు. బెజవాడ అని వ్రాసిన దానిక్రింద వివరాలని చూస్తున్నాడు శేషగిరి. 'బెజవాడలో 'ఫ్లూ' వ్యాధి ఉధృతంగా ఉంది. ప్రభుత్వమువారు వేసిన ప్రత్యేక రైళ్ళు, బస్సులు రద్దుచేయబడ్డాయి. ఈజ్వరం బెజవాడయందు ప్రతీ యింటా ఉన్నట్లు మాకు వార్తలు చేరినవి. అందుచే పై ఊళ్ళవాళ్ళెవరూ ఈ ఊరు రాకూడదు. కృష్ణయందు స్నానము చేయకూడదు. అట్లు స్నానముచేసిన ఈ జ్వరం ఎక్కువగా వ్యాపించుటకవకాశములున్నవి."ఇదివార్త.

ఈవార్త చదివి శేషగిరి కూలబడాడు కుర్చీలో. ఏదో ఊహాలోకాల్లో విహరిస్తున్నాడు శేషగిరి. అతనికి ఒక్క విషయం సంతోషాన్ని కలుగచేసింది: '60 స్పెషల్ ట్రైనులు, 40 బస్సులు రద్దుచేయబడ్డాయి.'

సాయంకాలం ఇంటికెళ్ళాడు. పెద్దపిల్లలిద్దరూ జ్వరంతో పడుకున్నారు. అడుగుపెడుతూండగానే అర్ధాంగి అందుకుని పిల్లలిద్దరికీ జ్వరమని మనవి చేసింది. 'ఊ' కొట్టాడు శేషగిరి. పిల్లల వంటిమీద చెయివేసి చూచాడు. అబ్బ కాలిపోతోంది. శేషగిరి వళ్ళునొప్పిగా ఉందని పడుకున్నాడు. అర్ధాంగి కంగారుపడింది. తెల్లవారేసరికి జ్వరం ముంచుకొంది 104° డిగ్రీలతో.

అర్ధాంగి కంగారంతా యింతా కాదు. తానే స్వయంగా వెళ్ళింది డాక్టరుగారింటికి. పెద్దపిల్లలిద్దరూ జ్వరంతో పడుకున్నారు. మందు తెచ్చింది. శేషగిరి కళ్ళుమూసుకొని పడుకున్నాడు. జ్వరంతో తలా, వళ్ళూ అంతా నొప్పిగానూ బాధగానూ ఉన్నా, అతని హృదయం ఎంతో తేలిగ్గా ఉంది. పిల్లలిద్దరూ జ్వరంతో బాధపడుతున్నారని అతనికెక్కువ విచారంగా లేదు. అతనేదో ఆలోచనల్లో మునిగిపోయాడు. అరవై స్పెషల్ ట్రైనులు, వలభై బస్సులు ప్రత్యేకంగా వేసిన కొంటేనులు,రద్దుచేయబడ్డాయి. బెజవాడలో 'ఫ్లూ'వ్యాధి ఉధృతంగా ఉండటమువల్ల పై ఊరివాళ్ళెవళ్ళూ రాకూడదని పేపర్లో వ్రాశారు. అందుచేతను, తన యింటికి వేసుకున్న అంచనా ప్రకారం ముప్ఫైమంది రారు. బెజవాడకి పై ఊళ్ళవాళ్ళు రాకపోవడంచేత తనలాంటి గుమాస్తాలెంతమంది రక్షింపబడ్డారో, 'ఫ్లూ' వ్యాధివల్ల కొన్నిరోజులు బాధపడ్డా, తర్వాత నెమ్మదిగా కోలుకుంటారు. అదృష్టహీనులు, ఆయుర్దాయహీనులు చనిపోతారు. కాని అంతా చావరుగా.పోతే చుట్టాలదాడి ఉండదు. చుట్టాలు రాకపోతే, తమకున్నదికలో,గంజో త్రాగి పడుంటారు. చుట్టాలు వచ్చినట్లయితే, వాళ్ళకి సకల మర్యాదలూ జరపలేదని కోపం. తన కప్పయిచ్చే మహాదాత ఈ విశాల ప్రపంచములో ఎవరూ లేరు. ఈ 'ఫ్లూ' జ్వరం రూపంలో భగవంతుడేవచ్చి తనకి సహాయం చేశాడనుకున్నాడు శేషగిరి. అంతా భయకంపితులౌతున్న జ్వరాన్ని చూచి, శేషగిరి భయపడలేదు. ఈ వంకతో తనింటికి చుట్టాలదాడి తప్పింది. తను గెల్చాడు. ఏదో ఆనందం అతని హృదయానికి గిలిగింతలు పెడుతోంది.

అర్ధాంగి మందుగ్లాసుతో ప్రత్యక్షమయి. "మందు తీసికోండి" అంది. శేషగిరి లేచి మందుతాగి పడుకున్నాడు.

"మాయదారి జ్వరాలు, ఊరంతా యివేకదా, ఆరువేల మందికిపైగా ఉన్నారుట ఈ జ్వరాలవాళ్ళు ఊళ్ళో. ఈ పాడు జ్వరాలు వచ్చి ఊరుని ఏలాచేశాయో చూడండి. పుష్కరం సరదాయే లేదు. కృష్ణకి స్నానానికి వెళ్ళకూడదట. ఈ వెధవజ్వరాలు లేకపోతే బెజవాడ ఎంత కలకలాడుతూ ఉండునో, అందరిళ్ళూ చుట్టాలతో నిండి కన్నులపండువుగా ఉండేది. ఈ జ్వరాలని తెలిసే మ్యానాన్న వాళ్ళెవళ్లూ రాముని నిన్న ఉత్తరం వ్రాశారు. మీ కివ్వటం మర్చిపోయా రాత్రి. ఈ పాడు జ్వరాలు ఎలా వచ్చాయో, ఎక్కడనుంచి వచ్చాయో..." అంటూ ఉపన్యాసం సాగించింది అర్ధాంగి.

శేషగిరి ఉపన్యాసం అంతావిని, "శ్రీమతీ మనల్ని చుట్టాలబారినుండి రక్షించి పుణ్యం కట్టుకున్న "ఫ్లూ" జ్వరాన్ని ఎందుకు తిడతావు-దాని ధర్మమా అంటూ ఎంతమంది నాలాటి గుమాస్తాగాళ్ళు రక్షించబడ్డారో నీకు తెలుసా? ఇక జననమరణాలంటావా? అవి ఆయావ్యక్తులు చేసుకున్న పూర్వజన్మ పుణ్యఫలాన్ననుసరించి ఉంటాయి. ఇంత ఉపకారంచేసిన 'ఫ్లూ' కి మన ధన్యవాదాలర్పించుకోవాలి గాని, నిందించకూడదు" అన్నాడు.

అర్ధాంగికి అతని మాటలు అర్ధంకాక, అతనివైపోఅయిదు నిముషాలు దీర్ఘంగా చూచి, "మీకుగాని పైత్యం ఎక్కువవలేదు కదా. డాక్టరుగార్ని బ్రతిమాలి యింటికి తీసికొని రానా? అలా "ఫ్లూ" జ్వరాన్ని పొగుడుతారేమిటి?" అంది భయంగా.

అతను చిన్నగా నవ్వి, "భయంలేదు శ్రీమతీ. నేతెలుసుండే మాట్లాడుతున్నాను. పైత్యంలేదు, శైత్యంలేదు. "ఫ్లూ" నా అదృష్టంకొద్దీ వచ్చింది. ఇది నా అదృష్ట దేవత" అన్నాడు.

అర్థంకానట్లు భర్తని చూస్తోంది అర్ధాంగి. అంతలో అగ్రతనూజుడు మంచినీళ్లడిగితే యివ్వటానికెళ్ళింది.

శేషగిరి కళ్ళుమూసికొని పడుకున్నాడు "ఫ్లూ" ని అభినందించుకుంటూ. ★

# వనితా లోకం

## తప్పెవరిది?



"చెడ్డవారి చెలిమి చేయకు; మురికినీట కాలు నిడకు; పగటి నిదుర పనికిరాదు;" అంటూ బాబిగాడు, నీతివాక్యాలను, ఆరోగ్య సూత్రాలను ఏకంచేసి చదివేస్తున్నాడు, మహాజోరుగా.

"చెడవారంటే ఎవరురా? అన్నయ్యా!" అని చిటీచెలెలు ప్రశ్న వేసింది. బాబిగాడు నోరు వెళ్లబెట్టి ఆలోచించేడు. అంతవరకూ ఆ ప్రశ్నే వాడికి తోచలేదు. ఏదో, పాఠం మరునాడు మాష్టారికి ఒప్పచెప్పాలనే వాడి బాధ కాని, అర్థాలు, అంతర్యాలు అడుగుతే వాడికేం తెలుస్తాయి. అయినా తన పెద్దరికం నిలుపుకోవాలనే తాపత్రయంతో "గోపాలం లాటివాళ్లు" అన్నాడు.

చిట్టి, బుర్ర అడ్డంగా ఆడిస్తూ "గోపాలం చెడ్డపిల్లాడు ఎందుకయ్యాడు? వాడు నీకన్నా చాలా మంచివాడు. ఎప్పుడూ నాకు తాయిలం పెడుతుంటాడు. అవాంళజరిగిందో నీకు తెలుసా? నేను పరిగెట్తూంటే పడిపోయేను. కాలు కిరక్తంకూడా వచ్చింది. అప్పుడేం...గోపాలం వాళ్ళింటికి తీసుకెళ్లి మందు పెట్టి, నన్ను మన యింటిదాకా దిగబెట్టేడు. ఆ మందుసీసా పెడ్తూంటే పడి పగిలిపోయింది. వాళ్ల నాన్నగారు కొట్టేరు. నా మంచి అన్ని దెబ్బలు తిన్నా గోపాలం నా నేస్తం మానలేదు." అన్నాది.

"నిజమే; నాకూ తెలీదు గోపాలం ఎందుకు చెడ్డపిల్లాడో మరి; అందరూ అలా అంటారు. అమ్మ కూడా చెప్పింది, "ఒరే బాబీ! వాడి జట్టు కూడకు; వాడు మంచివాడు కాడు, అని; అందుకే అలా అన్నాను" అన్నాడు.

* * *

మహా, మహావాళ్ళే ఈ మంచి చెడల తారతమ్యాన్ని, విడతియ్యలేక చస్తూంటే, ఈ పసివాళ్లకి ఏం తెలుస్తుంది. ఏది మంచి? ఏది చెడ్డ? అని చెప్పడం అంత సులువైన పనికాదు. ఒకరికి మంచిగా తోచింది, ఇంకొకరికి చెడ్డగా తోచవచ్చు. ఈ మంచి చెడ్డలన్నవి దేశ కాలానుగుణ్యంగా మారుతుండడం మనం చూస్తున్నాము. "మహాభారత" రచన జరిగిననాటికి ఒక స్త్రీకి ఒకరుకన్నా ఎక్కువమంది భర్తలుండడం దూష్యం కాకపోయి వుండవచ్చు. లేకుంటే ద్రౌపదికి అయిదుగురు భర్తలుండడం సంభవం కాదు. ఇటీవలవరకు ఒక పురుషునికి ఎందరైనా భార్యలుండడం నిషిద్ధం కాదు. నేడది చట్ట ప్రకారం నిషేధించబడింది.

## చిక్కెక్కడ?



ఇవన్నీ ఎందుకు చెప్తున్నానంటే, ఏది మంచి? ఏది చెడ్డ? అన్నది కాలానుగుణ్యముగా ఎలా మారుతుందో; అలానే ఎవరు మంచి; ఎవరు చెడ్డ? అన్నది ఆ వ్యక్తులపై మనకున్న అభిప్రాయాలనుబట్టి ఒకొక్క పరిస్థితిలో వారి ప్రవర్తననుబట్టి మారుతుంటాయి.

### మంచి చెడ్డల నిష్పత్తి!

ఏ ఒక్కరూ మంచివారుగా కాని, చెడ్డవారుగా కాని జన్మించరు. మంచి, చెడ్డల మేళవింపు ప్రతి వారిలోనూ వుంటుంది. కాకుంటే వారు పెరిగే వాతావరణం, పెంచబడే పద్ధతిపైని ఈ మంచిచెడ్డల నిష్పత్తి కొద్దిగా మారవచ్చు. ఉదాహరణకి 4 : 8 పాళ్లలో మంచి చెడ్డలుంటే లోకం వారిని మంచివారంటుంది. ఆ పాళ్లు అటునుండి, ఇటు మారుతే చెడ్డవారంటుంది. ఆ కొద్ది వ్యత్యాసాన్ని సరిదిద్దడం అంతకష్టం కాకపోవచ్చు. కాని, అందుకు ఎవ్వరూ ప్రయత్నించరు సరికదా, ఆ దృష్టిపథాన్ని ఏ పరిస్థితులలోనూ మార్చుకో నిచ్చగించరు. ఒకడు ఒక తప్పుపని చేస్తే, ఆ తప్పు వాని జీవితాంతమువరకు వెన్నాడవలసిందే. వాళ్లు ఎంతగా మారినా, సన్మార్గవర్తనులయినా, ఆసత్యాన్ని ఒప్పుకోరు. ఏమంటే వాడు చెడ్డవాడు, అందుచే వాడుచేసే ప్రతి పని చెడ్డదే; అధమం అది చెడ్డపని కాకున్నా దానివెనుక చెడ్డ వుద్దేశాలే వుంటాయి. ఇదీ వారి వాదన. ఇదేరీతిగా ఒకసారి మంచివారు అని చలామణి అయినవారు ఎన్ని కాని పనులు చేసినా అవి వారి మంచితనపు బురఖాలో మునిగిపోతాయి.

### కొండగుర్తులు

ఈ మంచిచెడ్డల నిర్ణయ ఫలితాలు కుటుంబాలలో స్త్రీలమధ్య అధికంగా అగుపిస్తాయి. అసలు కొందరు వ్యక్తులను వారి వ్యక్తిత్వలతో గుణగణాలతో సంబంధం లేకుండానే చెడ్డవారిగా నిర్ణయిస్తారు. ఉ॥ అత్త, ఆడుబిడ్డ, సవతితల్లి వగయిరా. ఆమధ్య వనితాలోకంలో ఆడుబిడ్డలపై లేచిన దుమారం చూసి నేను చాలా విచారించేను. 'ఆడుబిడ్డ' అనే పదం చెడ్డతనానికి పర్యాయపదం కాదు. ఆమె మనలాటి స్త్రీయే. ఆమెకు అత్తిల్లు, భర్త, కాపురం వుంటుంది. అందలి కష్టనిష్ఠూరాలను ఆమెకూడా అనుభవించి వుంటుంది. నిజానికి ఎక్కడో ఏకైక సంతాన విషయంలో తప్పించి మనమంతా ఆడుబిడ్డలమే. మనకి ఒక అన్న, ఒక వదిన వుంటారు. ఈ దోషం అల్లా ఆడుబిడ్డతనంలో గాక, ఎదటి వారిని అర్థంచేసుకోలేక పోడంలో వుంది. వారు చెడ్డవారు; అని మనం ముందుగానే నిర్ణయించుకొంటే, ఆపైని వారుచేసే ఏ పని అయినా, ఏమాట అయినా మనకి చెడ్డగానే

ద్వివేదుల విశాలాక్షి

అనిపిస్తుంది. సందేహం లేదు. అందుకే ముందుగా ఎవరిపైనా నిర్ణీత అభిప్రాయాలంటూ పెట్టుకోకూడదు.

ఇదేవిధంగా చెడ్డతనానికి పేరుబడ్డ ఇంకొక వ్యక్తి సవతితల్లి. ఈ సవతితల్లులు పెట్టే బాధలను గురించి, మనం అనేక కథలు వినివుంటాం. సినీమాల్లో అనేక రీతులు చూస్తున్నాం. కాని, ఇందులో సత్యం ఎంతవరకు, దానికి బాధ్యులెవరు? అని ఆలోచించకుండా, సవతితల్లి కాబట్టి చెడ్డది అనడం సాహసమే అవుతుంది. సవతితల్లి అనేపదం అవతలివ్యక్తికి బిడ్డలున్నపుడే ఏర్పడుతుంది. ఇందులో బాధ్యత కలవారు భార్య, భర్త.

ముందుగా మనం ఆలోచించవలసింది. ఆమెకూడా మనలాటి ఆడదే. చిన్నతనంలో కన్నెపిల్లలందరిలాగే ఆమెకూడా ఎన్నో కలలు కంటుంది. అందమైనవాడు, చిన్నవాడు భర్తకావాలనీ, బాగా డబ్బుండి కారులో, లేకుంటే కాలినడకనైనా, చేయి చేయి కలుపుకొని షికార్లకి, సినీమాలకి తిరగాలనీ, ఏవో ఇలాటి కోర్కెలుండడం ఆమెతప్పు కాదుకదా?

## కలలు కరగిన రోజున

ఆమె దురదృష్టం కానీండి; ఆర్థిక కారణాలు కానీండి, వేటివల్లనయితేనేమి, ఆమె కోర్కెలు, కలలు అన్నీ ఎండమావులుగా మారి, ఆమె జీవనపథమే మారిపోయింది. ముగ్గురు, నలుగురు పిల్లలుకల రెండోపెళ్ళి వానిని ఆమె భర్తగా స్వీకరించవలసి వచ్చింది. ఇష్టం లేకుంటే వ్యతిరేకించరాదా? అంటారు. అలా జరిగితే వెంటనే ఆమె సంఘందృష్టిలో చెడ్డది, తల్లిదండ్రుల దృష్టిలో గయ్యాళి అవనే అవుతుంది. ఇంతకీ వ్యతిరేకించి ఆమె ఏమి చేస్తుంది? పెళ్ళి పీటలమీదనుంచి లేచి రైలెక్కాకే, ఎవడో చదువుకున్నవాడు, డబ్బున్నవాడు తారసిల్లి, అమాంతంగా ప్రేమించి పెళ్ళిచేసేసుకోడం అన్నది సినీమాలకీ, కథలకీ మాత్రమే పరిమితం అన్న విషయం మరచిపోకూడదు. ఆమెకి తలిదండ్రులను ఎదిరించి నిలిచేందుకి తగినధనం, విద్యా లేకపోవచ్చు. ఆ రెండూవున్నా, అందుకు వలసిన మనోధైర్యం లేకపోవచ్చు. కారణం ఏదైతేనేమి, ఆమెకి ఆ రెండో పెళ్ళి వరునితో వివాహం జరిగిపోతుంది.

వివాహమయి భర్తయింటికి వెళ్ళేసరికి ఆమెకి కన్పించే దృశ్యం, పెంకెతనంతో దెబ్బలాడుకుంటున్న పిల్లలూ, కన్నతల్లిని కోల్పోయి, ఆలనా, పాలనా లేక అల్లాడిపోతున్న పసివాళ్లూ, జీవితంలోని మాధుర్యాన్ని కోల్పోయి జీవచ్ఛవంలా వున్న భర్త. ఇదేనా ఆమె సృష్టించుకున్న సుందర స్వప్నం? ఇదేనా ఆమె ఆశించిన స్వర్గసీమ? కాదు...కాదు...అవన్నీ గాలిమేడలై కూలిపోయాయి. అవన్నీ కలలుగానే కరగిపోయాయి. ఇది నిత్యం!... ఇదిసత్యం...దీన్ని...ఈ నిజాన్ని తెలుసుకుని సర్దుకోవడానికి, ఆమెకి తగిన అవకాశం, పరిసితులూ కల్పించాలి. వీలయితే విడమరచి చెప్పాలి. కాని అలా జరుగుతున్నదా? అంటే, లేదనే చెప్పాలి.

## ఇరుగు పొరుగుల శ్రద్ధ

సవతితల్లి ఇంట్లో కాలు పెట్టిందనగానే ఇరుగు పొరుగుల అమ్మలక్కలు ఆవారనుంచి ఈ వారనుంచి వేయి కళ్ళతో చూస్తుంటారు. ఇదంతా పిల్లలపై అభిమాన మనుకోగలరు; అలాటిదేమీ వుండదు. ఆ పిల్లల మనసులు విరిగి, ఆమెపై సద్భావం లేకుండుట మినహా ఫలితం మరేం వుండదు.

మాతృత్వం అనేది స్త్రీకి ఒక గొప్ప అనుభూతి. మరవరానిఅనుభవం. ఆమెగర్భం ధరించింది లగాయతు పుట్టబోయే బిడ్డ గురించి, ఆ బిడ్డను సాకవలసిన పద్ధతి గురించి ఎన్నో ఆలోచించుకుంటుంది. ఆ బిడ్డ దైహికంగా తన పక్కని లేకున్నా, వూహాలతోనే ఆనందిస్తుంటుంది. నవ మాసములు నిండి, బిడ్డ పుట్టేసరికి, ఆమెకి ఆ బిడ్డకి అవినాభావ అనురాగం ఏర్పడుతుంది. అంతవరకు చిన్నపిల్లలా వున్న ఆ మాతృమూర్తి ఎంతో అనుభవంగల ప్రౌఢలా ఆ బిడ్డను లాలిస్తుంది. ఇదంతా ప్రకృతి సహజం. బిడ్డ గర్భస్థమైంది లగాయితు స్త్రీకి శారీరకంగా, మానసికంగా అనేక మార్పులు వస్తాయి. ఆమె ప్రేమప్రకృతి సిద్ధంగా పరిణతి చెందుతుంది.

ఈ విధాన చూస్తే, సవతితల్లి అపక్వ ఫలం. ఈ అనుభూతులు ఆమెకి లేవు. ఈ పరిణామాలు ఆమెలో రాలేదు. ఆ పరిస్థితులలో ఆమె పిల్లలకి కన్నతల్లిలా చెయ్యలేకపోయిందన్నా, చూడలేకపోయిందన్నా ఆ దోషం ఆమెది కాదు. ఆమెను అటువంటి పరిస్థితుల పాల్జేసినవారిదే అనాలి. ఆమె మనోభావాలను అర్థం చేసుకొని, ఆమెకి తగిన సహకారం, సానుభూతి లభించిననాడు సవతితల్లిని మన కథలలో వలె ఉగ్రరూపిణి గాక, స్త్రీ సహజమైన ఓర్పు, సానుభూతికల స్త్రీ మూర్తిగా మనం గుర్తించ గల్గుతాము. ఎవరికైనా సహనానికి ఒక హద్దంటూ వుంటుంది. కన్నతల్లిఅయినా పిల్లలను బెదరించకుండాకోపగించుకోకుండా పెంచగలదా? అప్పుడు నోరెత్తిని పెద్దలు



# దిండు గలీబు మీదకు—

దేవరపల్లి బుజ్జమ్మ

సవతితల్లి, పిల్లల్ని అదుపులో నుంచ ప్రయత్నిస్తే పురిమిచూస్తారు.

నిజానికి తప్పుచేసిన వారినీ, న్యాయంగా దండించవలసిన వారిని అలా వదలి, సంఘం అబలలపై దండెత్తడం అవివేకం. ద్వితీయ వివాహం చేసుకొన్న ఏ పురుషుని ప్రశ్నించినా, పిల్లలకొరకే తాను తిరిగి వివాహం చేసుకొన్నట్లు చెప్తాడు. ఇందులో నిజానిజాలు ఎలావున్నా, అసలు ఆ ఆశయ సిద్ధికి ఎంతవరకు ద్వితీయం వుపయోగపడగలదో ఆలోచిద్దాము. ఆర్థిక స్తోమతగల వ్యక్తి, పునర్వివాహ ప్రసక్తి లేకుండానే తనపిల్లల్ని పెంచుకోగలడనడానికి సందేహం లేదు. పూర్వపు రోజులలో ఎలా వున్నా ప్రస్తుతం ధనం సాధించలేని సౌకర్యం అంటూ లేదు. తగినంత అర్థిక స్తోమత లేనివాడు ఇంకొక భార్యని వివాహమాడితే, ఆమెకి, పుట్టబోయే పిల్లలకి అన్యాయం చెయ్యడమే అవుతుంది. ఇంకొక విషయం; పిల్లల సంరక్షణే తమ ఆశయమైతే, అందుకు తగిన అనుభవము అర్హత గల్గిన వితంతువులను ఎందుకు వివాహమాడకూడదు? అనే ప్రశ్న బయలుదేరుతుంది. అట్టి వివాహంవల్ల తన కుటుంబ రక్షణే కాకుండా ఒక సత్కార్యం చేసినట్లవుతుందే.

నిజానికి అలాటి వివాహం అన్ని విధాలా అనుకూలంగా వుంటుంది. ఆ వచ్చే స్త్రీ కూడా కష్టసుఖాలను కొంతవరకు అనుభవించి వుండడంచేత, తన నూతన భర్త యొక్క కష్టసుఖాలను అర్థంచేసుకోగలిగి వుంటుంది. చిన్నతనపు చిలిపి కోర్కెల వత్తిడి తగ్గి, జీవనపథంలో సహచరిగా ప్రవర్తించగల్గిన ప్రౌఢత్వం అబ్బిఉంటుంది. తన ఆశలు, ఆశయాలు అంతరించేయను కొన్న స్థితిలో చిగుర్చిన ఈ నూతన శోభ ఆమెను ఆనంద పరవశురాలను చేస్తుంది. సహృదయత, కృతజ్ఞత ఇనుమడిస్తాయి. పిల్లల పెంపకంలో కూడా ఆమెకి కొంత అభ్యాసం కల్గివుంటే మరీ మంచిది. అట్టి భార్యను పొందగలినవాడు పురుషుడు తన గడచిన జీవితంలోని బాధలను మరచి ముందుకి పురోగమించ అవకాశము కలుగుతుంది.

## కర్త, భర్త

“తల్లి లేనివాడు, తండ్రి పినతండ్రితో సమానం” అన్న లోకోక్తిని మనం మరచిపోదాం. ఏమంటే; తలిదండ్రుల కిద్దరికీ పిల్లల ఎడగల ప్రేమానురాగాలు సమానమే. అట్టిప్రేమ ఒక్కమారుగా తెగిపోదు. నూతనభార్య రాగానే పురుషుడు శిలామూర్తి కాలేడు. అదివరలో భార్యతో, పిల్లలతో అనుభవించిన అనుభూతులను విస్మరించలేడు. కాని అతడు అసహాయుడవుతాడు. ఒకపక్క, తననే నమ్ముకొని, జీవితాంతం తనతో జీవించ వచ్చిన భార్య; ఇంకొక పక్క, అన్యం పుణ్యం ఎరుగని పిల్లలు. వీరందరి భవిష్యత్తు తనచేత ఉంటుంది. వారి జీవితాలకు తానే వరవడిపెట్టాలి. భార్యను వెనకేసుకొచ్చి, పిల్లల్ని దండించడం ఎంత క్రూరమో, పిల్లలగురించి భార్యతో పోట్లాడడమూ అంతటిదే అవుతుంది. ఈ పరిస్థితి కల్పించింది ఎవరు? తను...దీనికి నివారణోపాయాన్ని తానే అన్వేషించాలి. ఈ విభిన్న వ్యక్తుల మధ్య సామరస్యం నెలకొల్పడం తన కనీసవిధి.

ఒకరిపై ఇంకొకరి అధికారం ఎల్లకాలం చెల్లుబడికాదు. నేటి పిలలు రేపు పెద్దలవు

(39-వ పేజీ చూడండి)




## చెవిలో పోటు

ఇది సామాన్యంగా పిల్లలందరికీ వస్తూనే వుంటుంది. కొంతమంది పిల్లలికి పాపం ముక్కులు కళ్ళమంటే చాలు ఇట్టే వస్తుంది. నిజంగా పోటు వచ్చినవాళ్ళ సంగతిగాని మనకి అబద్ధాలవాళ్ళ సంగతి ఎందుకు? ఈ చెవులో పోటు సాధారణంగా వాతంవల్లగాని, హోరుగాలివల్లగాని, కురుపువుండటంవల్లగాని వస్తూంటుంది.

10 ఏళ్లు 11 ఏళ్ళ వాళ్ళకి వాతంవల్ల అని తెలుసుకుంటే వావింటాకు పసరు పిండెయ్యాలి. కురుపు లేకుండా పోటు వస్తే వాతంవల్లగాని గాలివలనగాని అని మనకి తెలియనే తెలుస్తుంది.

మంట భరించలేని పిల్లలికి అంటే నెల రెండునెలల పసిపిల్లలికి రుద్రజడఆకు పిండితే అదే పోతుంది.

కురుపు వుండటంవల్ల పోటు వచ్చిందని తెలిస్తే మామూలు ఉల్లిపాయి కాల్చి చెవులో పిండెయ్యాలి. ఇంకోరకంగా నూనెలో వెల్లులిపాయి వేసి కాచి పొయ్యాలి. వీటికి వేటికీ తగ్గక కురుపు వున్నదని మనకి ముందే తెలిస్తే, - గవ్వలాటలో గళ్ళల్లో జరుపుతూ ఆడతారు-ఆ పావు తీసుకొని బాగా కాల్చెయ్యాలి. అంటే గవ్వని చితుకకొడితే మెత్తగా అయిపోవాలన్నమాట. ఆ గవ్వ కాల్చిన పొడుం ఒక చిటికెడు చెవులో వేసి నిమ్మకాయరసం రెండు మూడు చుక్కలు పిండితే చేత్తో తీసేసినట్టు పోతుంది. చెవిలోంచి చీముకారేవాళ్ళకి అసలు చెవులో నూనే వెయ్యరాదు. అల్లా వేస్తే మళ్లీ చీము ఎక్కువవుతుంది.

## మాడు పోటు

సాధారణంగా చదువుకునేవాళ్ళందరికీ మాడుపోటు, కళ్లు మంటలు, జుట్టునెరవటం ఇత్యాదులు జరుగుతూనేవుంటాయి. వేడి చేసి వస్తూంటుంది మాడుపోటు. మాడుపోటు వచ్చినవాళ్ళు విధిగా వారానికి రెండుమాట్లయినా తలంటు పోసుకోవాలి. ఆముదం అన్నా వెన్నపూస అన్నా తలకు అంటుకుని కనీసం 3 గంటలయినా వుండాలి. వేడి వస్తువులు తినటం మానేసి చల్లటి వస్తువులు తినాలి. ఆముదపు ఆకులు గాని, మల్లె ఆకులు గాని, తంగేడు ఆకులు గాని వేసి మాడుకు కట్టుకోవాలి. రాత్రిళ్ళు పడుకోబోయే ముందు ఒక చిన్న కప్పులోకి ఒక గుప్పెడు అన్నం, కాసిని పాలు వేసి తోడుబెట్టాలి. తెల్లవారినతరువాత సూర్యోదయం కాక మునుపు ముఖం కడుక్కొని ఈ తోడు బెట్టిన అన్నం మూడుముద్దలుగా చేసుకు తినాలి.

ఎం. శ్రీదేవి

అంతకీ తగ్గకపోతే డాక్టర్ని శరణని ముచ్చటగా మూడు కాల్షియం ఇంజక్షన్లు పొడిపించుకొని ఫీజు చెల్లగొట్టి రావాలి.

## కళ్లు నీళ్లుగారటం

ఎక్కువ పొయ్యి దగ్గర వుండేవాళ్ళకి, చదువుకునేవాళ్లకి తప్పకుండా కళ్లునీళ్లుగారతాయి. కొంతమందికి కొయ్యకండలు పెరుగుతాయి. ఏదయినాసరే బ్రహ్మదండ సొన (అంటే చెట్లనిండా ముళ్ళుండి పసుపుపచ్చగా పువ్వులు పూస్తాయి) కళ్ళల్లో కాటుక పెట్టుకున్నట్టుగా పెట్టుకోవాలి. కొయ్యకండలు పెరిగితే మంగలిరాయి, ముద్దబబ్బు, సొంతికొమ్ము అరగదీసి కళ్ళల్లో పెట్టుకోవాలి. కళ్లుగనక కలిగితే బట్టబచ్చలాకు, నల్లమందు ఉడికించి కళ్లచుట్టూరా కట్టువెయ్యాలి. కొయ్యకండలు గనక తగ్గకపోతే డాక్టరుదగ్గరికివెళ్ళి కళ్ళు తోమించుకోవాలి.

## నోటి పూత

అతిఉడుకుమూలంగా నోటిలో సన్న సన్నటిపొక్కులు లేస్తాయి. వేడివస్తువులు ఎక్కువ తినకూడదు. సగ్గుబియ్యం జావ కాచి చల్లారినతరువాత అది త్రాగించి ఏం కులు నోరుమూతలేకుండా నవిలించాలి. తమలపాకులు వేసుకొని పొక్కితే యేమీ చెయ్యక్కరలేదు. ఎక్కువ కారంకనక తింటే దానంతట అదే తగ్గిపోతుంది. నోటిపూత ఎంతకీ తగ్గకపోతే డాక్టరుదగ్గరికి వెళ్లడం మంచిది.

## జలుబు

జలుబు 10 రోగాలపెట్టు అంటారు. జలుబుచెయ్యగానే తలనొప్పి దానివెంట జ్వరం అన్నీ వస్తాయి. అందుకని అసలు జలుబుపట్టకుండానే చూసుకోవాలి. పసిపిల్లలకైతే కస్తూరిమాత్ర వేసి అరగా అరగా నూనెరాయాలి.

## బెణుకులు

ఆటలు ఆడేటప్పుడో, చిన్న చిన్న ఎత్తుపల్లాలు దాటేటప్పుడో కాళ్ళు బెణుకుతాయి. బెణికినచోట కొద్దిగా నూనెతో తోమితే అదేపోతుంది. మెడకూడ ఒక్కొక్కప్పుడు బెణుకుతుంది. ఏదయినాసరే గుండ్రంగావున్న వస్తువు మెడకింద పెట్టుకు పడుకోవాలి.

## గవదబిళ్ళలు

ఇవి గాలిమార్పులు, ఋతువుల మార్పులలో వస్తాయి. వాటికి గాలి తగలకుండా తలమీదనుంచి ఒక తెల్లటి శుభ్రమైన గుడ్డ కట్టుకోవాలి. అవిశాకుపసరు తీసి గవదలకి అంటించి దానిమీద దూది అంటించాలి.

## రక్తగ్రహణి

వేడిచేస్తే చాలు చిన్నపిల్లలకి రక్తగ్రహణి పడుతుంది. పట్టుకున్నదంటే వదిలిపెట్టేరకం గాదు ఇది. పచ్చి సపోటాలు తీసుకొని రోట్లో వేసి దంచి ఆ రసం గుడ్డలోపోసి వడబోసి పట్టాలి. ఇది వగరుగా వుండటం మూలకంగా కొందరు త్రాగరు. ఏదైనా తీపి వస్తువు పెడితేసరి. వాళ్లే త్రాగుతారు. కారం తాకనేకూడదు అసలు. గసగసాల పొడుం

అన్నంలో వేసుకొని తినాలి. అజాగ్రత్తచేస్తే 3, 4 నెలలు ఏడిపిస్తాయి. దానిమ్మకాయ పిందె (అప్పుడే గింజపడుతున్నది) తీసుకొని తెల్లనిబట్ట మూటగట్టి చుట్టూరా రాగిటిమన్ను మెత్తి, కుంపట్లో వేసి వుడకబెట్టాలి. గుడ్డ ఊడదీసి చూస్తే లోపల అంతా వుడికి మెత్తగావుంటుంది. అది పంచదార్లో కలుపుకొని తినాలి. లేకపోతే దానిమ్మచిగుళ్ళు కోసి రోట్లో వేసి నూరి రసం తీసుకు త్రాగాలి. ప్రొద్దున్నే పెరుగూ మెంతులూ కలిపి తినిపించాలి.

### కాలుట

పిల్లలు మనం ఎక్కడ కూర్చొబెడితే అక్కడ బుద్ధిమంతుల్లా కూర్చుంటారా? చేతులూ కాళ్ళూ ఏవో వొకటి చేస్తూనే వుంటాయి. వాళ్ళకి కాగే నీళ్లు మీదపోసుకొని, ఎర్రటి నిప్పుల్లో చెయ్యిపెట్టి, మరిగే నూనెలో చేతులుపెట్టి కాల్చుకుంటారు. పెద్దవాళ్ళు చూడక పమిటచెంగులూ అవి కాల్చేసుకుంటూ వుంటారు. పెద్ద పెద్ద బొబ్బలు పొక్కుతూవుంటాయి. అటువంటి వాటిన్ని కడిగకూడదు. వెంటనే సిరాకాని, సుద్దకాని రాయాలి. బొబ్బలికి అంటుకొని వున్న గుడ్డల్ని మెల్లిగా కత్తిరించి తీసెయ్యాలి. కొబ్బరినూనె, సున్నపునీరు కలిపితే నవనీతం అవుతుంది. దాన్ని పూసి వాసెలైను పూసిన లింటుగుడ్డలో గాయాన్ని కప్పి డాక్టరు దగ్గరికి తీసుకువెళ్లాలి. ★

## తప్పెవరిది? చిక్కెక్కడ?

(37- పేజీ తరువాయి)

వారు చిన్నతనపు లేతహృదయాలపై పడే గాయాలు మాయని మచ్చలై వాళ్లతోపాటే పెరిగి పెద్దవవుతాయి.

కోపం ద్వేషం అలా పెరిగి ఒక్కొసారి వారిని తలిదండ్రులనుండి వేరుచేయగలవు. వృద్ధులయిన తలిదండ్రులపై, ఆదరం, అభిమానం లేక పిల్లలున్నారంటే, అది చిన్నవాడు తాము వేసిన విత్తే అన్న సంగతిని పెద్దలు మరువకూడదు. దానికి వారిని నిందించేకన్నా, ఆ పరిస్థితి కలుగకుండా ముందే జాగ్రత్తపడితే అందరికీ క్షేమకరం కాగలదని గ్రహించడం మంచిది

సంఘోద్ధరణకి కావున్నా తను గృహశాంతి, పిల్లల పెంపకం మనస్సులో పెట్టుకునైనా, పునర్వివాహ ఆసక్తిగల పురుషులు వితంతువులను వివాహం చేసుకుంటే, వారికి, సంఘానికీ కూడా మేలుచేసినవారు అవుతారు. అలాకాక ఇప్పటివలెనే చిన్నపిల్లల పైపై మొగ్గుచూపుతే, అందువలన సంభవించు దుష్ఫలితాలను, ఆ కుటుంబమంతా అనుభవించక తప్పకపోవచ్చు. మంచినే ఆశిద్దాం. పురుషులు ముందు తరాలవారికి మార్గదర్శులవుతారని నమ్ముదాం. ★



## మందు పుట్టడానికి ముందు...

కొన్ని కొన్ని వ్యాధులపేర్లూ, వాటి గుణగణాలూ వింటూవుంటే, ఇవి అనాదిగా వుంటున్నవేనా, లేక, వైద్యశాస్త్రంలో చిత్రవిచిత్రాలైన పేర్ల జాబితా పెరగడంకోసం కొత్తగా బయలుదేరి వస్తున్నాయా అనిపిస్తుంది

జబ్బుచేసిన మనిషి బతికి బైటపడటానికి, మందుకన్న ముందు తేలవలసిన విషయం—అసలు యీజబ్బు ఏమిటి? ఇది ఎక్కడినించి వచ్చింది ఎందుకు వచ్చింది? దీనికి మూలకారణం ఏమిటి? అనేది ఇది తెలిస్తే దీన్ని పోగొట్టడానికి మందు తయారుచెయ్యవచ్చు; ముమ్ముందు ఇంకెవరికీ రాకుండా చెయ్యడానికి ఉపాయాలూ ఆలోచించవచ్చును అందువల్ల అనేక వ్యాధుల లక్షణాలూ, అవి రావడానికి మూలకారణాలూ తెలుసుకోవడం ఒక పెద్దపని చాలా కష్టమైన పని చాలాకాలం పట్టేపని

ఇవాళ ఒకమందు మింగితే, ఒకజబ్బు తక్షణ నిముషంలో నయం కావచ్చు అలా నిముషంలో గుణం చూపించిన ఆ మందును కనిపెట్టడానికి అంతకుముందు ఏళ్ళతరబడి కృషి జరిగిఉంటుంది.

ఇదంతా వ్యాధులతో మానవుడు సాగించే యుద్ధానికి, తెరవెనుక సన్నాహం వంటిది మందులషాపుకు, డాక్టరు ఆఫీసుకు కర్మాగారంవంటిది. ఇందులో ఎందరో అహోరాత్రాలు పనిచేస్తూఉంటారు ఎడతెరిపిలేకుండా ఆలోచిస్తూ ప్రయోగాలుచేస్తూ ఉంటారు స్త్రీలు చాలమంది ఈ రంగంలో చాలా గొప్ప ఫలితాలు సాధించారు సహజంగా వారికి అబ్బే సహనశక్తి ఇందుకు ఎంతో దోహదం చేస్తూఉంటుంది ఫ్రెంచి శాస్త్రజ్ఞురాలు మడాం క్యూరీ రేడియం కనిపెట్టి పుట్టకురుపు చికిత్సకు వరం ప్రసాదించింది

ఈ చిత్రంలో శాస్త్రజ్ఞురాలిపేరు రోజ్ ఇచెల్‌సన్ అమెరికన్ మహిళ 50 సంవత్సరాలుగా అంతుచిక్కకుండా ఉన్న ఒక వ్యాధి గుణగణాలను ఈవిడ ఇటీవలే కనిపెట్టింది ఈ వ్యాధి చిత్రమైనది ఇంగ్లీషులో దీనిని 'మలిపుల్ స్క్లెరాసిస్' అంటారు శరీరంలో ఏ మూలో ఎక్కడో ఒక చోట హఠాత్తుగా రక్తం చిక్కబడడం మొదలు పెడుతుంది మెల్లిగా గడ్డకడుతుంది. దానివల్ల ఆ చుట్టుపక్కల జీవకణాలు గిడసబారిపోతాయి దాని మూలంగా ఆ ప్రాంతంలో నరాలు కూడా గట్టిపడిపోతాయి క్రమంగా ఈ వ్యాధి ఇతర ప్రాంతాలకు కూడా వ్యాపిస్తుంది ఇది నరాల పక్షవాతం అన్నమాట. మిస్ రోజ్, ఫిలడెల్ఫియాలోని సెయింట్ ల్యూక్ ఆస్పత్రి పరిశోధనాలయంలో పనిచేసి, ఈ వ్యాధి గుణగణాలను కనుగొన్నది ఈ వ్యాధి చికిత్సకు ఇది మొదటి మెట్టువంటిది ఈమె కనుగొన్న విషయాలతో ఇంకా పరిశోధనలు సాగించి చికిత్సకే కాక, ఈ వ్యాధి నివారణకు కూడా మార్గాలూ మందులూ కనుగొనవచ్చునని అమెరికాలోని పెద్ద పెద్ద వైద్యశాస్త్రజ్ఞులు అందరూ చెబుతున్నారు

వంచనా శిల్పం:

# అమ్మబోతే అడివి ★ ★ కొనబోతే కొరివి

కొల్లూరి వెంకటసుబ్బలక్ష్మి

ప్రపంచమంతా దగా, మోసంతో నిండి వుంది. ఏది కొందామన్నా కల్తీ సరుకు. ఏవి అమ్ముదామన్నా దగా చేస్తారు.

సాధారణంగా మనం అమ్మబోయేవి పాత పేపర్లు, పాత చీరల జరీను. ఇప్పుడు ఎంత చిన్న వుద్యోగులైనా పేపర్లు తెప్పించని వారు, రేడియో సెట్టు లేనివారు అరుదు. ఒక నెల తిరిగేసరికి ఈ పేపర్లతో ఇల్లంతా గలీజుగా వుంటుంది. ఏ పల్లెటూరో అయితే కిరాణా కొట్టు కోమటిని బతిమాలి అమ్మాలి గాని, పట్టణాలలో అయితే వుదయం 7 గం మొదలు కేక వేస్తూ తిరుగుతూంటారు "పేపర్లు కొంటాం, డబ్బాలు కొంటాం, జరీ కొంటాం" అంటూను.

ఇంక ఇంట్లో చిరాకు భరించలేక పోనీ పిలవండానికైన పనికివస్తుందని వాణ్ణి పిలిచి తూచుకోమంటే చక్కగా 4 వీ॥ కొలతాలు వీశెన్నర క్రింద తూచి పెడ్తాడు. అమ్మగారు బేరం ఆడుకోవాలిగాని మీ కొలతం ముగ్గు మా కెందుకండి అంటూ రెండు పేపర్లు పైకెత్తి పట్టుకుంటాడు. మనం నిజంగా ముగ్గు తూగినందుకు పట్టుకుని తీసివేశాడనుకుంటాముగాని, అసలు వాడు చేసిన దగా తొందరగా కనిపెట్టలేము. దగా ఏమిటంటే అరవీశరాయి వేసి తూచుతుంటే వీశపైగా పేపర్లు ఇవతల తక్కెడ బిళ్ళలో పెడతాడు. పైకి ఎత్తి ముగ్గువుందని రెండు పేపర్లు చేత్తో పట్టుకుని తక్కెడ పైకెత్తుతాడు. మనం ముగ్గువుంటే తీశాడనుకుంటాము గాని కర్ర పైకి ఎత్తుతున్నాడనుకోము.

## దగా గదా!

రెండవదగా వాళ్ళ తక్కెడ కర్ర ఇనుపది చేసుకుంటాడు. ఆ ఇనుపదానికి తక్కెడ బిళ్ళలు కట్టేటందుకు బెజ్జం వుండడానికి బదులు రెండంగుళాలపొడుగున గాడివుంటుంది. మనం తక్కెడ దారం చూపించమంటే బిళ్ళలు రెండు కూడా ఆగాడిచివరలకు వచ్చేలాగ తాళ్లు జరిపి దారం చూపిస్తాడు. తక్కెడ సమానంగా, న్యాయంగా వుంటుంది. రాయివేసి తూచుతాడు. పేపర్లు వేసి ఎత్తేటప్పుడు మనకు తెలియకుండా పేపర్లువున్నవైపుతాడు ఆగాడిలోపలవైపుకు తోస్తాడు. అది మనంగ్రహించి ఆతాడుకూడ చివరకే వుండేలాగతోస్తే వీశకు అరవీశ పేపర్లు ఎక్కువవుంటాయి. పేపర్లు అమ్మబోయేటప్పుడు ఈ రెండుసంగతులు మరచి పోకూడదు.

వీధిలో, జరీకొంటాం, జరీకొంటాం అని చెవులు చిల్లులుపడేలాగ అరుస్తారు. పాత చీరల జరీవుందిగదా అని పిలిచి అడిగితే తులం 8 రూ॥ చొప్పున కొంటాం అంటాడు. వాళ్ళు చేసేదంతా దగాఅంటారుగాని ఎలా దగాచేస్తారో ఎవరూ చెప్పరు. వాళ్ళుచేసే దగాఏమిటో చూద్దామని వాళ్ళను పిలిచాం. అంతక్రితమే పాత బనారసుచీర జరీఅంతా మూడ్పు 5 తు॥ తూచి కాగితంలో పొట్లం గట్టి పెట్టాం. జరీ తెల్లగా కాలి తాళ్లు తాళ్లు లాగ పెద్ద దబ్బకాయంతవుంది.

## 'వాడిల్లు బంగారంగాను!'

పిలవగానేవచ్చి కూర్చుని వాడిదగ్గరవున్న చిన్న ట్రంకు తెరచి ఎడంచేతికి తగిలేలాగ పెట్టుకున్నాడు. ఆపెట్టెలో 2 పాతడబ్బాలు సుమారు శేరుపట్టేవి వున్నాయి. ముందు రాగానే నీపెట్టెలోవి ఏమీ జరీలో కలప కూడదన్నాము. సరేనన్నాడు. జరీ మంచిదో కాదో చూస్తానని చెప్పి పలకముక్క (సుమారు ఆరంగుళాలు వెడల్పు 10 అంగుళాలు పొడుగు వుంది) తీసి ఎడంచేతిలో పెట్టుకొని కుడిచేత్తో చిన్న వుండలా జరీతీసి పలకమీద రాయడం మొదలుపెట్టాడు. ఈపలక, జరీవున్న కాగితంమీదనే పెట్టేవాడు. కొంతసేపురాని చిన్న వుండ మాముందుకు విసిరి "అమ్మగారు ఇదంతా బంగారం; చూచారా ఎల్లావుందో జరీ చాలామంచిది అమ్మగారు. పూర్వపుచీర కనుక ఇల్లావుంది. ఇప్పటిచీర అయితే ఇల్లావుండదు అంటూ కబుర్లు చెప్పుతున్నాడు. మా దగ్గరకువిసిరిన వుండ బంగారంఅనుకుని మురిసిపోతే వాడుచేసేదగాకు చాల వీలుగా వుండును. కాని మేము వాడికేసే చూస్తున్నాము. మళ్ళీ వుండ విసిరి "మా కా రా బంగారం" అన్నాడు. అప్పుడు మాకు అనుమానం వచ్చి రెండు మాట్లు చూసేదేమిటి బంగారం వక్కమారు చాలదా? అనుకొని నీ పలకకింద ఏముందో చూపించు అన్నాము. అనేటప్పటికి వాడి దగా బైటపడింది. పలకపైన బొటనవ్రేలు మిగతా నాలుగు వ్రేళ్ళు పలక అడుగున వున్నాయి. అడుగువ్రేళ్ళతో కాగితంలోని జరీ సగంపైగా లాగి, వ్రేళ్ళకు పలక మధ్య పెట్టుకొన్నాడు. ఇల్లా వాడివ్రేళ్ళల్లోకి సగం జరీ వచ్చినతర్వాత ఎడంచేతి పక్కనే వున్న పెట్టెలో డబ్బామీద పలకపెట్టేస్తాడు. వ్రేళ్ళమధ్యవున్న జరీ డబ్బాలో పడిపోతుంది. మనం ఇంత జరీయే వుందేమో అని అడిగేందుకు వీలులేదు. ఏమన్నా అంటే మీరు ఇక్కడే వున్నారు గాదా అంటాడు. ఇదీ వాడు చేసేదగా.

## కొనబోతే

వీధిలో కూరలు కొందామని పిలిస్తే, వీశకు మూడు పవాసేర్లు తూచివెడతారు. వాళ్ళదగా ఏమిటంటే—

మనం కాయలు ఏరి తక్కెడలో వేశాక ఎడంచేత్తో తక్కెడ పట్టుకొని తక్కెడ పైకి ఎత్తేటప్పుడు కుడిచేత్తో పుచ్చుకుని పైనవుండే ములుతాడు గుప్పెడతో పట్టుకుని కాయలున్నవైపు నొక్కి పట్టుతారు. తక్కెడ చూస్తే కాయల వైపే మొగ్గుతుంది. కాయలు చూస్తే అరవీశ అన్నవి పవాశేరు పైన వుంటాయి. కావడితో అమ్మే వాళ్ళైతే రెండు తట్టలమధ్య తక్కెడ పెట్టి, కాయలున్న సిబ్బెతట్టకు తగిలేలాగ పెట్టి బరువు ఆపుతాడు, కొనబోతే ఇల్లా దగా చేస్తారు.

పాలు కొనుక్కుందామా అంటే సగం మిల్కుపౌడరు పాలు సగం స్వచ్ఛమైన పాలుకలిపి చిక్కగా పోస్తారు.

వెన్న కొందామంటే ఏంపౌడరు కలుపుతారో తెలియదు కాని, వెన్నకొనేటప్పుడు మజ్జిగవాసన వేస్తూ చాలాబాగుంటుంది. తీరా కాచినతర్వాత సగంవరకు మాడిపోయి పిండివంటచేసిన వాసనవస్తుంది. పోనీ నెయ్యి కొనుక్కుందామంటే మనకు ఇచ్చేటప్పుడు బాగుంటుంది. కొద్దిసేపటికి డాల్డాలాగ గట్టి పడిపోతుంది. స్వచ్ఛమైన వప్పునూనె కొనుక్కుందామంటే సగం శుభ్రమైన వేరుశెనగనూనె సగం వప్పునూనె కలిపి వప్పునూనెధర తీసుకుంటారు.

ఇంక మధుర, కోయంబత్తూరు, వుప్పాడ, వెంకటగిరి మొదలైన నేత చీరల సంగతి చూడండి. పైటచెంగున అరగజంవరకు చాల నాణ్యంగా నేస్తాడు. అదిచూచి చీరను కొనుక్కొని ఇంటికితెచ్చి విప్పి చూస్తే పిండిజల్లెడలాగ వుంటుంది. అందుకనే మన వాళ్ళు అమ్మబోతే అడివి కొనబోతే కొరివి అన్నారు.



# ★ షీకాయచెట్టు ఉపయోగాలు ★

షీకాయచెట్టు ఆకు చిగుళ్ళతో పచ్చడి, పప్పు—చారు—ఇత్యాది వంటకాలు చేయవచ్చును. షీకాయాకు చిగుళ్ళతో వంటలేమిటని అనుకోకండి. చేసి చూచినమీదట బాగ తెలుస్తుంది.

షీకాయచెట్టున్న వాళ్ళు లేతచిగుళ్ళను కోసి చేసుకుంటే బాగుంటుంది. కాని ఆకులంత బాగుండవు.

చిగుళ్లతో పచ్చడి—నూనె వేసి, ఈ చిగుళ్ళను వేయించుకోవాలి. తర్వాత మిరపకాయలు ఆవాలు, మెంతులు, కొద్ది ఇంగువ వేసి పోపు వేయించుకుని, ఈ వేయించిన చిగురు—పోపు, తగినంత వుప్పువేసి, కలిపి రుబ్బాలి. దీనికింక చింతపండు వేయక్కరలేదు. ఇదే చాలపుల్లగా వుంటుంది. ఇష్టమైనవారు నువ్వుపప్పుకూడ వేయించుకుని రుబ్బుకోవచ్చును.

ఇలాగే పప్పుకూడ చేసుకోవచ్చు.

దీనికి కందిపప్పుకంటె పెసరపప్పు బాగుంటుంది. పెసరపప్పు మెత్తగా వుడికిన తర్వాత, ఈ చిగురుకూడ వేసి, తగిన పచ్చిమిర్చి ముక్కలుకూడ వేసి, బాగవుడికిన తర్వాత, తగినంత వుప్పువేసి దించవలెను.

ఒక కళాయిగిన్నెలోకాని, స్టీలుగిన్నెలో కాని నూనెవేసి, మిరపకాయ ముక్కలు, ఆవాలు, ఇంగువ, జీలకఱ్ఱవేసి పోపు వేయించుకుని, ఈపోపులో వుడికినపప్పును వేసి కలిపి దించుకొనవలెను.

చింతపండు వేయవలసిన అవుసరం లేకుండానే చారుకు తగినంత చిగురు వేసుకుని బాగా మరిగిన తర్వాత మామూలుగా చారుకు పెట్టుకునే పోపుపెట్టవచ్చును.

సాధారణంగా చాలమంది షీకాయతోనే తలంటు పోసుకుంటారు. ఇది కుంకుళ్లకంటె చాల శ్రేష్టము. మెదడుకు చాలమంచిది. కొంతమంది దీనిని వుడికించి, మెత్తగా రుబ్బుకొని దానితో తలంటుపోసుకుంటారు.

కాని కొంతమంది ఇలా రుబ్బుకోరు. షీకాయను తెచ్చి ఎండబెట్టి బాగుగ ఎండిన తర్వాత మెత్తనిగుండగా కొట్టించుకుని ఒకడబ్బాలో పెట్టుకొని, కావలసినప్పుడల్లా ఈ గుండని వేడినీళ్లలో కలుపుకుని ఉపయోగించుకోవచ్చును. ఈ గుండతోనే వలుగుకూడ పెట్టుకొనవచ్చును.

కాని కొంతమంది వుడికించకుండానే చన్నీళ్లుజల్లుతూ రుబ్బుకొని వుపయోగించుకుంటారు. ఇలాచేసినా బాగానే వుంటుంది.

షీకాయ వాడుటవలన చర్మానికి ఒక విధమైన మృదుత్వముకూడ వచ్చును.

ఎ. రంగ [గూటాల]

* * *

## మజ్జిగతో చేగోడీలు

కావలసిన సామాను: పావుశేరు విసరిన వరిపిండి (బియ్యం పిండి), మజ్జిగ (పుల్లగా వున్నది), నూనె.

చేసే విధానం: ముందు మజ్జిగలో తగినంత వుప్పువేసి కుంపటిమీద పెట్టాలి. అదిబాగా మరిగాక, వరిపిండి కొలిచి వుంచుకున్న పావుశేరూ అందులో వేసి వుండకట్టకుండా బాగా కలపాలి. వెంటనే దించేయాలి. మరిగిన మజ్జిగలో పిండిపోశాక ఒక అయిదు నిముషాలకంటె ఎక్కువసేపు వుంచకూడదు. అట్లా వుడికించిన పిండిని తీసుకుని, పీటకి నూనెరాసి చేతితో ఈ వుడికించిన ముద్ద కొంచెం కొంచెం తీసి పీటమీద వేసి శుభ్రంగా చేతితో పిసికి నిమ్మకాయంత లేసి చొప్పున అన్నీ ఒకేసైజులో వుండలు చేసుకుని, పీటకి నూనెరాసి దానిమీద ఈవుండ పెట్టి వలంగా (లావుగా) కాడలాచేసి దానిని ఆకోసా ఈకోసా దగ్గిర నొక్కేయాలి. అట్లా నొక్కితే చేగోడీ విడిపోదు. అదే విధంగా అన్నీ చేసుకుని పెనంలో నూనె వేసి, అది కుంపటిమీద పెట్టి బాగా మరిగాక ఆనూనెని బట్టి అయిదో ఆరో చొప్పున చేగోడీలు వేసి ఎఱ్ఱగా వేగాక వేడిమీదనే తింటే పుల్లపుల్లగా ఎంతో రుచిగా వుంటాయి. ఇదేవిధంగా ఇంకా ఎక్కువ చేసుకునేవారు ఎక్కువ కొలతలతోను, తక్కువ చేసుకునేవారు తక్కువ కొలతలతోనూ చేసుకోవచ్చు. దీనికి మజ్జిగ తొలిరోజుది, అంటే పుల్లగా వున్న మజ్జిగ అయితేనే బాగా వుంటాయి. మజ్జిగ ఎంత పుల్లగావుంటే చేగోడీలు అంత బాగా వుంటాయి.

బలభద్రుని వరలక్ష్మి
(విజయనగరం.)

* * *

## పెరుగుతో - పెసరట్లకూర

ఒకశేరు పాలుకాచి రాత్రి తోడుపెట్టుకొనవలెను. ఒకశేరు పెసరపప్పు రాయి ఇసుక లేకుండా శుభ్రంగా బాగుచేసి నానపోసుకోవలెను. బాగా నానిన తరువాత బాగా కడిగి, తగినంత వుప్పు, కారము వేసి అంత మెత్తగా కాక, బరకగా కాక రుబ్బవలెను. ఐదుతులాలు నీరుల్లిపాయలు, రెండు వెల్లుల్లి గడ్డలు, మూడు వుండీలు పచ్చి మిరపకాయలు ఒక చిన్న అల్లం ముక్క మెత్తగా కొట్టి, రుబ్బిన పిండిలో కలపవలెను— తోడుపెట్టిన పెరుగులో, నిమ్మకాయంత చింతపండు నానబెట్టి, ఆ కాడు రసముతీసి కలపవలెను. పచ్చి గర్మసాలా, ఇది బజారులో తయారుచేసిందైనా కొని వాడవచ్చు. లేదా సామాను కొనైనా మనం చేసుకోవచ్చు. గర్మసాలాకి కావల్సిన సామాను, జీలకఱ్ఱ, ధనియాలు, గసగసాలు, ఏలకపప్పు, లవంగాలు, దాల్చిన చెక్క, ఆకుపత్రి, మసాలా సామాను మెత్తగా రుబ్బి పెరుగులో కలపవలెను.

రుబ్బిన పిండి మందంగా దళసరిగా అట్లుపోసి

(56వ పేజీ చూడండి)




స్త్రీలు వారి ఉద్యోగాలను గురించి వ్రాయడం మొదలుపెడితే అంతము వుండదనుకోవాలి. స్త్రీలుకూడా ఉద్యోగాలు చేయాలి, కుటుంబ ఆర్థికస్థితికి సహాయం చేయాలని అందరూ అంటారేగానీ వుద్యోగాలుచేసే స్త్రీలను గౌరవించే వారెందరో మనం ఆలోచించాలి. ఒక ఆఫీసులో ఒకావిడ వుద్యోగం చేస్తుందంటే తోటి స్త్రీలే శ్లాఘించలేరే! ఇక పురుషులు ఏమాత్రం గౌరవిస్తారు? తమ భార్యలను ఎంతమంది భర్తలు వుద్యోగం చేయనిస్తారు? ఇతర దేశాల్లో అయితే ప్రతి శాఖలోను, ప్రతి పరిశ్రమలోనూ స్త్రీలు పనులుచేస్తున్నారు. కానీ శారదగారు చెప్పినట్లుగా ఒక ఉపాధ్యాయ, వైద్య వృత్తులలో తప్పితే మిగతా శాఖలలో స్త్రీల ప్రాముఖ్యం తక్కువ. ప్రస్తుతం చాలామంది మగవారే వుద్యోగం లేక అల్లాడుతుంటే స్త్రీల సంఖ్య (వుద్యోగా లివ్వడంలో) హెచ్చించడమంటే అది సాధ్యం కాదేమో. మొత్తానికి స్త్రీలు కొన్ని వుద్యోగాలకు మాత్రమే అర్హులని చెప్పాలి. క్యాంపులకువెళ్ళే వుద్యోగాలు స్త్రీలు నిర్వహించడంలో చాలా యిబ్బందులు ఎదురవుతాయి. నైతిక విలువ స్త్రీ, పురుషులిద్దరిలోను పెరగాలి. అప్పుడే స్త్రీ పురుషునితో సమానంగా ప్రతిపనిని నిర్వహించకలుగుతుంది. లేనినాడు కొన్ని చిక్కులు తప్పవనుకోండి. వుపాధ్యాయినీ, వైద్య వృత్తులలోనే వుండిపోవలసి వస్తుంది.

నేటి ముఖ్య సమస్యలలో ఒకటైన 'స్త్రీలుఉద్యోగాలు'-అనే వ్యాసాన్ని వనితాలోకం పాఠకుల దృష్టిలోకి తెచ్చిన శారదగారు అభినందనీయులు.

సి. అనసూయ, నెల్లూరు.

* * *

## శ్రీ కృష్ణజయంతి

డి. ఎస్. లక్ష్మిగారు "శ్రావణమాసంలో" అన్న వ్యాసము వ్రాశారు. అన్నీ వ్రాశారు ఒక్క కృష్ణజయంతి తప్ప. ఈ ఉత్సవము సాధారణముగా వైష్ణవుల ఇండ్లలో జరుగుతుంది. ఇది అందరికి ఆనంద సమయమే. ఈ ఉత్సవము దేవ నాగరుల ఇండ్లలో సాక్షాత్తు శ్రీకృష్ణుడు జన్మించినట్లే చేస్తారు. ఆ రోజు సాయంత్రము పేరంటాలంతా వస్తారు. వారి శక్తికి తగ్గట్లు తాంబూలాలు ఇస్తారు. రెండవ ఉత్సవము "ఉట్టి ఉత్సవము." దీప దీపాలవేళ శుభ్రమైన ప్రదేశములో ఒక చెట్టుక్రింద అలికి రంగు రంగుల ముగ్గులు పెడతారు. పైన ఒక ఉట్టికట్టి అందులో ఒకకుండపెట్టి అందులో పాలుగాని, వెన్నగాని. పరమాన్నము గాని పెట్టి అందులో ఒక రూపాయ వేస్తారు. చిన్నపిల్లలందరినీ చేరదీసి దాన్ని అందుకోనమంటారు. అది అందకుండా ఊగిస్తారు. ఆ సమయములో వసంతము కలిపి చిమ్మనగ్రోవితో వారిపైన చల్లుతూంటారు. చివరకది ఎవరందుకుంటే అందులోది వారికే దక్కుతుంది. ఇది చూస్తూంటే చాల సరదాగా ఉంటుంది.

కలిసిపూడి శకుంతలాదేవి,

రాజమండ్రి.

* * *

11-9-57 వనితాలోకములో "పవని నిర్మలప్రభావతి" గారు "ఉత్తరాల దొంగలు" అనే వ్యాసము చాలా చక్కగా వ్రాశారు. వారికి నా ధన్యవాదాలు. పి. అనసూయగారు వ్రాసిన పిండివంటలు తయారుచేసినాము. అవి బాగా కుదిరినవి అని వారికి తెలుపవలయును. వనితాలోకంలో చాలా సంగతులు తెలుపుచున్నందులకు మా ధన్యవాదాలు.

కె. ఎ. దేవి, శ్రీకాకుళం.

* * *

'ఉత్తరాల దొంగలు' వ్యాసం బాగుంది. సంతోషం. ఈ కాలంలో అలా చేసేవారు పలువురున్నారు అంటే అతిశయోక్తి గాదు. కాలేజీలలోఅయితే మరి బాధగావుంటుంది. ఆఫీసులలో గూడా యీలాంటివారు ఉంటారు. ఎవ్వరికైనా వుత్తరం వస్తే వారు ముందర చూసి చదివితేగాని మనస్సు ఉండబట్టదు.

మాడభూషి శేషాద్రి,

తాడేపల్లిగూడెం.

* * *

ఉత్తరాల దొంగలు, ఆవ్యాసం చదివిన కాస్సేపు బుజాలు తడుముకొని, పాడినపాటే పాడరా పాసిపళ్ళదాసరీ, అన్నటుగా మళ్ళా యథాప్రకారం తయారవుతారు. అటువంటి వాళ్లను మార్చడం మనతరం కాదేమో! మనం దగ్గర వున్నంతసేపూ, అసలావుత్తరంవైపే వాళ్ళదృష్టి వుండదుగాని కాస్త కనుమరుగయితే. గబగబా చదివెయ్యడానికి ప్రయత్నిస్తుండగా, రూవరైనా అక్కడకు రావడం, తటస్థిస్తే తాము ఆ వుత్తరంనుండి దృష్టి తప్పించుకొని. దొరికిపోకుండా వుండటానికి మహాతాపత్రయ పడిపోతారు. అటువంటప్పుడు వాళ్ళను చూస్తుంటే మహానవ్వొస్తుంది.

వుత్తరాల దొంగలే కాకుండా, ట్రంకుపెట్టెల దొంగలుకూడా వున్నారు యీ దొంగలు ఆడవాళ్ళలోను, మగవాళ్లలోనూ కూడా వున్నారు. రూవరి పెట్టెలో యేముందో చూసేఅలవాటు మహాదరిద్రపలవాటు. రూవరూ లేకుండా చూసి ట్రంకుపెట్టెలు చక్క పెడుతుంటారు. మళ్లీ దొంగతనం చెయ్యరు. అయినాఅటువంటి వాళ్ళను చూస్తుంటే చాలా అసహ్యం కలుగుతుంది. ఇటువంటి పనులు చేసేవారు బుజాలు తడుముకు కోవ్వడకుండా, బుద్ధిని మార్చుకుంటె మంచిది. వుత్తరాల దొంగలగురించి చూటిగావ్రాసిన నిర్మల ప్రభావతిగారికి నా అభినందనలు.

సరోజిని, మదరాసు.

* * *

ఒక హైస్కూలులో విద్యార్థులు కొందరు ఒకరి ఉత్తరం ఒకరు తీసికొని దానిని చదివి కడపటికి అసలువానికి జాబుచేర్చక నే దానిలోని విషయములు తను చదువుకొనుటది గాక ఇతరుల కందరికి తెల్పేవారు. ఇటువంటివారు ఈ వ్యాసం చదివియుండిన కొంత వరకు బుద్ధి తెచ్చుకొందురు అని నేను నమ్ముచున్నాను.

జి. సుబ్రహ్మణ్యం, కార్వేటినగరం.

* * *

'ఉత్తరాల దొంగలు' అనే వ్యాసం చాలా చక్కగా ఉంది. ఇటువంటి వ్యాసాలు చదివినప్పుడన్నా ఈ రకం వాళ్ళలో మార్పు వస్తుందని, ఆశిస్తూ యున్నాను.

ఆవుల మద్దులేటి, హైదరాబాదు.

★




# అర్థరూపాయ - అరలెంపకాయ

★ కనుమూరి వెంకటరాజు ★

ప్రక్కవీథిలో - నొక్కబాలుడు
పెంకిపనులకు - పెద్దవాడే.
పెద్దలన్నను - జంకులేదా
పెంకిబాలునకు.

ఒక్కరోజున - సాటివానితో
భేటిరాగా - మాటపెరిగీ
చెంపమీదొక - లెంపకాయను
ఛెళ్లుమనిపించెన్.

పాపమాతడు :- ఏడ్చుకొనుచును
పోయి చెప్పగ - పెద్దమనిషితో
పెద్దమనిషా - పెంకిబాలుని
పిలువనంపించెన్.

అతడురాగా - తగవు కనుగొని
పెంకివాడే - దోషియనుచును
పెంకిబాలున - కర్థరూప్యము
తప్పిదము వేసెన్.

పెంకిబాలుడు - తోడనే తన
వద్ద రూప్యము - పెద్దమనిషికి
తప్పిదముకై - యిచ్చి మిగిలిన
అర్థ నిమ్మనియెన్.

అర్థ రూప్యము - లేకపోగా
పెంకిబాలుడు - జంకులేకను
లెంపరెండవ - చెంపవేసీ
రూప్యమిడిపోయెన్.



# పాఠాలు



పాఠాలు, పాఠాలు
ప్రతిరోజు పాఠాలే.
విసుగెత్తిపోతోంది
అసలె మతి చెడుతోంది!

అటు కదలరాదంట,
ఇటు కదలరాదంట;
ఎప్పుడూ కూర్చుండి
ఏదో చదవాలంట!

ఈలపాటలు వినరు
గాలిబాలాకలె నను
"పాఠాలు మాని, ఇక
బైటాడుకో!" అంది.

చెట్టుపై ఒక చిన్న
పిట్ట పాడుతు నన్ను
"పాఠాలు మాని, ఇక
బైటాడుకో!" అంది.

కాని, ఆ గోడపై
కాలాన్ని చూపించు
గడియార మంటోంది
"గడియ వృధచేయ" కని.

బి. వి. నరసింహారావు.




నండూరి విఠల్ బాబు

(గతసంచిక తరువాయి)

వర్తకుడు ప్రయాణంచేసిచేసి చివరకుతన ఊరు చేరుకొన్నాడు. ఇంటికి చేరగానే అతని భార్య సాదరముగా ఆహ్వానించి, ఒక చక్కని పాపను తెచ్చి "నాథా! భగవంతుడు మనకీ పాపను ప్రసాదించాడు" అని చెప్పింది.

లేక లేక కలిగిన బిడ్డను చూచి వర్తకుడు ఆనందంతో, పొంగిపోయాడు. కాని మాయావికి తాను చేసిన వాగ్దానం జ్ఞప్తికి వచ్చినంతనే అతని ఆనందం అంతా అదృశ్యమై దుఃఖ సముద్రంలో మునిగి పోయాడు.

వర్తకుడట్లు దీనావదనుడైఉండుట చూచి అతని భార్య "నాథా! ఎందు కట్లు చింతిస్తున్నారు? ఇంటికి రాగానే మీకేమి బాధ కలిగినది?" అని అడిగింది.

వర్తకుడు జరిగిన కథంతా చెప్పి "ప్రేయసీ! నేను యింటికి వచ్చునరికి నాకు తెలియకనే కలిగియుండు అదృష్టమును ఇస్తానని మాయావి అను రాజునకు వాగ్దానం చేశాను. మనకు కలిగిన అదృష్ట మీ ముద్దు బిడ్డడేగదా! లేకలేక కలిగిన బిడ్డను ఎట్లు వదలిపెట్టడమూ అని విచారించుచున్నాను" అన్నాడు.

ఈ విషయం విని వర్తకుని భార్య గూడా మిక్కిలి విచారించింది. చివరకు ధైర్యంతెచ్చుకొని "నాథా! జరుగనున్నది జరుగక మానదు. ఎన్నడో రాబోవు ఆపదను గురించి నేటినుండి మనమెందుకు విచారించడం? భగవంతునే నమ్మి ఉందాం. ఆయనే మనల రక్షిస్తాడు" అని హితవు చెప్పింది.

ఆనాడు దైవప్రార్థనచేసి వర్తకుడు బంగారుపెట్టెను తెరచాడు. అందుండి బుడగలు బుడగలుగా గాలి బయటకువచ్చి కండ్లుమూసి కండ్లుతెరచు నంతలో ఎదురుగా ఒక ఉన్నతమైన బంగారుసౌధం కనిపించింది.

వేలాది సేవకులు-దాసీలు వర్తకుని లోనికి ఆహ్వానించారు. అప్సరసల వంటి అరవైమంది పనికత్తెలు వర్తకుని భార్యను పన్నీటిలో స్నానమాడించి - జరీబట్టలు కట్టారు. వర్తకునికి గూడ సకలోపచారాలు జరుగుతున్నాయి. ఆ బంగారు మేడలో ఒక ధనాగారమున్నది.

అందులో వెలలేని ధనరాసులు గుట్టలు గుట్టలుగా ఉన్నాయి.

వర్తకుడు తనకు కలిగిన అదృష్టం చూచి గర్వపడక, బీదసాదల నాదరించుచూ భార్యతోను, బిడ్డతోను సుఖముగా ఆ దివ్యసౌధంలో కాపురము చేస్తున్నాడు.

పదిహేను సంవత్సరాలు గడచిపోయినాయి. వర్తకుని కుమారుడు విజయుడు పెద్దవాడయ్యాడు.

* * *

ఒకరోజు ఉదయమున విజయుడు తండ్రితో "నాకు రాత్రి ఒకస్వప్నం వచ్చింది. మాయావి యనురాజు తక్షణం తనముందు హాజరుకమ్మని నాకాజ్ఞాపించెను. అతని ఆజ్ఞను తిరస్కరించినచో మనకు గొప్ప యాపదల తెచ్చి పెట్టెదనని చెప్పాడు" అనెను.

తల్లిదండ్రులు విలపించి విలపించి చివరకు బిడ్డను మాయారాజ్యమునకు పంపారు.

విజయుడు పట్టణములను, కొండలనూ దాటి ఒక అడవి చేరాడు. ఆ అడవిలో ఒక

ఆ అడవిలో ఒక చిన్నకొండ ఉంది.ఆ కొండకొక గుహ ఉంది. ఆ గుహద్వారం మూయబడి ఉంది

విజయుడు ఆ కొండగుహ దగ్గరకు వెళ్లి "ఓ గుహద్వారమా! నన్ను లోపలకు రానిమ్ము" అన్నాడు.

గుహద్వారం క్రిగుమని తెరచుకొంది. విజయుడు లోనికి ప్రవేశించాడు. ఆ గుహలో ఒక మంత్రగత్తె ఉంది.. ఆ మంత్రకత్తె ముక్కు గ్రద్ద ముక్కువలె ఉంది. ఆమె చేతిలో ఒక మంత్రదండ మున్నది. ఆ గుహలో రెండు తెల్ల మేకలు కట్టబడి ఉన్నాయి.

ఆ మంత్రకత్తె విజయుని చూచి "ఓయీ! ఎవరవు నీవు? ఎచటనుండి వస్తున్నావు?ఎచటకు పోతున్నావు?" అని ప్రశ్నించింది.

విజయుడు "ఓ అవ్వా! నడచి నడచి అలసివచ్చిన అతిథిని మర్యాద చేయటం యిట్లాగేనా? దాహంతో పీక ఆర్చుకొని పోతున్నది. కొంచెము మంచినీళ్లియ్యి"అన్నాడు.

మాంత్రికురాలు మంత్ర దండమును విదలించింది. మంచినీరు వచ్చింది. దానిని త్రాగి అలసటతో విజయుడు నిద్రపోయాడు. మాంత్రికురాలు స్నానం చేసివచ్చుటకు సమీపమునగల ఏటికి పోయింది.

ఇంతలో ఆ గుహలో కట్టబడి ఉన్న రెండు మేకలలో ఒకటి విజయునితో "ఓ పరదేశీ! ఈ మాంత్రికురాలు మోసకత్తె. ఆమె రాక్షసి. ముగ్గురు అందమైన యువకులను ప్రతి పూర్ణిమకు బలియిస్తూ వుంటుంది. మేము నీవలెనే యువకులము. మమ్ము మోసగించి మంత్ర జలం జల్లి మేకలుగా మార్చివేసింది. నిన్నుగూడ అట్లే మార్చివేసి, ఈ రాత్రికి ముగ్గురిని బలియిస్తుంది" అని చెప్పింది.

విజయుడు చింతించి "మిత్రమా! మన మీ ప్రమాదంనుండి బయట పడుటకు మార్గమేది?"అని అడిగాడు.

రెండవమేక "మాంత్రికురాలి శక్తికి కారణమైన మంత్రదండం ఈ గుహలోనే ఒక రహస్య స్థానంలో ఉంటుంది. ఆమె వచ్చేలోపల గుహ అంతా వెదకి - మంత్రదండమును దొంగిలించితే ఆమె మనకు లొంగిపోతుంది" అని చెప్పింది.

విజయుడు గుహ అంతా వెదకి చివరకు చేజిక్కించుకొన్నాడు. మంత్ర దండమును మూడు పర్యా



కృష్ణానది కుడిగట్టున నాగార్జునసాగర్ డాం వద్దవున్న మిశ్రమ ప్రాథమిక పాఠశాల ప్రథమ వార్షికోత్సవం ఆగస్టు 15 వ తేదీన జరిగింది. ఆ సందర్భంలో అసిస్టెంటు ఇంజనీరు శ్రీ ఎం. వి. నాగేంద్రరావుగారి పుత్రిక కుమారి ఎం. వి. ఎల్. కృష్ణకుమారి నృత్య ప్రదర్శనం ఇచ్చింది. పాఠశాల తరఫున కృష్ణకుమారికి రజతపతకం బహూకరింపబడింది.

యాలు మేకలచుట్టూ తిప్పి నేల మీద కొట్టాడు.

రెండు తెల్ల మేకపిల్లలు ఇద్దరు సుందరులైన యువకులుగా మారిపోయాయి. ఆ యువకులు మరుక్షణంలో గుర్రాలెక్కి పారిపోయారు.

మాంత్రికురాలు స్నానంచేసి వచ్చి జరిగిన మోసము తెలిసికొని, వర్తకుని కుమారునితో "బాబూ! నా మంత్రదండం నాకిచ్చివేయి. నీకు ఏ సహాయము కావలెనన్నా చేస్తాను" అన్నది.

విజయుడు తనను మాయా రాజ్యం జేర్చితే మంత్రదండం ఇస్తానన్నాడు. మాంత్రికురాలు అందు కంగీకరించి మంత్రదండం తీసుకొని

యిట్లా అన్నది. "మాయారాజ్యపు రాజైన మాయావి మీరు చేసిన మోసమునకు మిక్కిలి కినుకవహించి ఉన్నాడు. నీవు చాలా అదృష్టవంతుడ వగుటచేత యిటొచ్చావు. ఈ అడవికి ఉత్తరమున ఒక సెలయేరున్నది. దాని వెంట తూర్పుగా మూడామడలు నడచి వెళ్లితే ఒక సరస్సు కనిపిస్తుంది. ఆ సరస్సు గట్టున ఒక చెట్టు చాటున నీవు ఒదిగి ఉండు. మూడు తెల్ల పావురము లెగిరివచ్చి ఆ గట్టుపై వ్రాలుతాయి. అవి రెక్కలు విప్పుకొని ముగ్గురు సౌందర్యవతులైన కన్యలుగా మారిపోతాయి. వారు వస్త్రములను గట్టుపైనుంచి సరస్సులో జలక్రీడలకు దిగుతారు వారిలో కడపటి కన్య రెక్కలకు ఇరుప్రక్కల మణు లుంటాయి. నీవు సమయం కనిపెట్టి ఆమె రెక్కలను దొంగిలించు. ఆమె నిన్ను పెండ్లాడుతానని మాటయిచ్చే వరకూ రెక్కలను యివ్వద్దు. నీకు మేలు జరుగుతుంది"

విజయుడు మాంత్రికురాలు చెప్పినట్లు సరస్సు దగ్గరకు వెళ్లి ఒక చెట్టుచాటున ఒదిగి ఉన్నాడు. ఆకాశంలో మూడు అందమైన పావురములు ఎగిరివస్తున్నాయి. అందులో ఒకదానికి మణులు పొదిగిన రెక్కలున్నాయి. అవి ఎగిరివచ్చి సరస్సు గట్టుపై వ్రాలి ముగ్గు రప్సరసలవంటి కన్యలుగా మారిపోయాయి ఆ కన్యలు రెక్కలను ఒక పొదమాటున దాచి, సరస్సులో జలక్రీడలకై దిగారు. మాంత్రికురాలు చెప్పినట్లు మణులు పొదగబడిన రెక్కలను విజయుడు దొంగిలించి ఏమి జరుగుతుందో అని

చూస్తూ ఉన్నాడు. ఆ సుందరాంగనలు జలక్రీడలు ముగించుకొని ఒడ్డున కొచ్చారు. అందులో ఇద్దరు రెక్కలు కట్టుకొని పావురములై ఎగిరిపోయారు. మూడవ సుందరి తన రెక్కలకై వెదుకుతోంది.

ఆమె వెదికి వెదికి "నా రెక్కలు దొంగిలించిం దెవరు? నీవు ముసలివాడివైతే నా తండ్రిగా ప్రేమిస్తాను. మధ్యవయస్కుడవైతే మామగా ప్రేమిస్తాను. సుందరుడైన యువకుడవైతే ప్రేమించి పెండ్లి చేసుకొంటాను" అని పిలిచింది.

విజయుడు చెట్టు చాటునుండి బయటకువచ్చి "సుందరీ! నీ రెక్కలివిగో" అన్నాడు.

సుందరి "యువకుడా! నీ వెవ్వరవు? ఎచ్చటనుండి వస్తున్నావు? ఎచ్చటకు పోతున్నావు?" అని ప్రశ్నించింది.

విజయుడు జరిగిన కథంతా చెప్పాడు.

ఆ సుందరి "ప్రియుడా! నేను మాయావిరాజు పుత్రికను - నా పేరు సుందరి" అని చెప్పింది.

సుందరి మాయావి ముగ్గురు కుమార్తెలలో కడపటిది. సౌందర్యంలో గాని, సంగీతములో గాని ఆమెను మించిన కన్య ప్రపంచంలో జన్మించలేదు. ఆమె విజయుని సుందర రూపాన్ని చూచి మోహించి యాతడే తనకు తగినవరుడని మనస్సులో భావించింది. తదుపరి మాయారాజ్యమునకు మార్గ మెరిగించి ఆ సుందరి రెక్కలు కట్టుకొని పావురమై ఆకాశమున కెగిరి మబ్బులలో కలసిపోయింది. ★

(ఇంకా ఉంది)

# సినిమా

## సత్యజిత్ రాయ్ విజయం

**1957,** భారత చలనచిత్ర చరిత్రలో ఉజ్వలమైన సంవత్సరం అంతర్జాతీయరంగంలో అడుగుపెటిన మన కళాకారులకు ఇది చిరస్మరణీయమైన సమయం చలనచిత్ర కళలో అనేకవిధాల ఎంతో అభివృద్ధి సాధించి పేరు గడించుకొన్న అనేక దేశాలతో పోటీచేసి, అన్ని చలనచిత్రోత్సవాలలోను మన చిత్రాలు బహుమతులు సాధించాయి ప్రశంసలు సంపాదించాయి భారతప్రభుత్వం సమర్పించిన బిమల్ రాయ్ ప్రొడక్షన్స నిర్మించిన "గౌతమబుద్ధ", కాన్స చలనచిత్రోత్సవంలో ఉత్తమ డాక్యుమెంటరీగా బహుమతి నందుకొంది దర్శకుడు తపన్‌సిన్హా నిర్మించిన "కాబూలీవాలా" చిత్రం ఈ ఏడాదే బెర్లిన్ ఉత్సవంలో సంగీతానికి బహుమతి నందుకుంది పండిట్ (పథేర్ పాంచాలీ, అపరాజిత) రవిశంకర్ దీనికి సంగీతం సమకూర్చారు 1946 లో కాన్స ఉత్సవంలో ప్రథమబహుమతి నందుకొన్న 'నీచానగర్'కు కూడా ఈయనే సంగీత దర్శకుడు ఆపైన కార్లవీవారీ (జెకోస్లా

## బొంబాయి సినిమాలేఖ

వాకియా) లో రాజ్ కపూర్ చిత్రం "జాగ్ తే రహో" ప్రథమ బహుమతి గడించింది

### విజయత్రయం

ఇవన్నీ ఒక ఎత్తు బెంగాలీ కళాకారుడు సత్యజిత్ రాయ్ సృష్టించిన, కళాఖండాలు 'పథేర్ పాంచాలీ' దానితరువాయి 'అపరాజిత' లు ఒక ఎత్తు ఈ నెల తొలివారంలో సత్యజిత్ రాయ్ పేరు మారుమోగిపోయింది 'పథేర్ పాంచాలీ' 1956 కాన్సఉత్సవంలో బహుమతి నందుకోవడం విదితమే. ఇపుడది తిరిగి 11వ ఎడింబర్గ ఉత్సవంలో ప్రముఖ అమెరికన్ నిర్మాత డేవిడ్. ఓ. సెల్జనిక్ పేరిట ఇచ్చే సువర్ణ బహుమతిని సంపాదించింది అమెరికన్ చిత్రాలు తప్ప, మిగతా అన్ని దేశాల చిత్రాలూ ఈ పోటీలో పాల్గొంటాయి. 1949 లో డేవిడ్ సెల్జనిక్, ఉత్తమ



సత్యజిత్ రాయ్

(54-వ పేజీ చూడండి)

ప్రాక్పశ్చిమాల సమ్మేళనం! దొరసానమ్మ వేషం బనాయించి బుకాయిస్తున్న నకిలీ దొరసానిగా జానీవాకర్, ఆవిడగారి అందాన్ని సూటిగా భరించలేక అద్దంలో చూచి ముగ్ధురాలు అవుతున్న శ్యామ—'ఛోటా పైసా' అనే చిత్రంలో

# బొంబాయి సినిమా వార్తలు



## 'భగవాన్ ఔర్ సైతాన్'లో జమున

మనోమోహన్ ఫిలింస్ పేరిట, మనోమోహన్ సాబిర్ నిర్మించనున్న హిందీ చిత్రం "భగవాన్ ఔర్ సైతాన్"లో ప్రముఖ తెలుగునటి జమున నాయికపాత్ర నిర్వహిస్తుంది దాంపత్యం కేవలం దైహికం, ఐహికం మాత్రమే కాదని వాటికి అతీతమైనదీ, పవిత్రతర మైనదీ అనీ చాటడం ఈ చిత్రం ఇతివృత్తం లక్ష్యం ఇది ప్రాతిపదికగా, దర్శకనిర్మాత క్వాజా అహమద్ అబ్బాస్ మూడేళ్ళ క్రితం ఒక కథను రూపొందించారు

భర్త సరిగా లేనివాడు, విడాకులిచ్చి, వైవాహిక సంబంధాలను తెంచుకోవడానికి ఉపాయాలు ఉన్నా, భారత స్త్రీ ఆ జోలికి పోదు. పట్టావ—ఆ మాటకొస్తే ఎన్నడూ పోదు. చెడుదారిన పడిపోతున్న భర్తను ఏదో ఒక విధాన మంచిదారికి మళ్ళించి కాపరం నిలబెట్టుకుని జీవితాన్ని సుఖమయం చేసుకోవడానికే ప్రయత్నిస్తుంది తూరుపుఖండపు వారలకూ, దూరలకూ ఇదే తేడా ఒకప్పుడు, ఈ కథను ఇప్పటి నయా సన్సార్ ఇంటర్నేషనల్ పేరిట నిర్మించాలనుకున్నారు గాని సోవియట్ భారతదేశాలు రెండింటికీ సంబంధించిన కథను తీసుకోవాలన్న సంకల్పంతో అప్పటికది నిలిపివేయడం జరిగింది ఇప్పుడు మనోమోహన్ సాబీర్ దీన్ని నిర్మిస్తున్నారు రచనతోపాటు దర్శకత్వ పర్యవేక్షణ కూడ అబ్బాస్ నిర్వహిస్తారు

ఒక దక్షిణభారత నటిని హిందీ తెరాభిమానులకు పరిచయం చేసే సంకల్పంతో సాబీర్, అబ్బాస్‌లు కొందరితో సంప్రదింపులు జరిపిన మీదట, ఈ చిత్రంలో ప్రధానపాత్రను జమునకు ఇవ్వ నిశ్చయించారు సాబిర్ రెండు నెలల క్రితం మద్రాసువెళ్లి, ఒప్పందం వ్రాసుకు వచ్చారు

జమునకు మద్రాసు చిత్రాలలో పని వత్తిడిగా ఉన్నందువల్ల (ఇప్పుడామె నటిస్తున్న తెలుగు, తమిళం, హిందీ చిత్రాలు మొత్తం 20 ఉన్నాయి) ఈ చిత్రం నిర్మాణంలో నూరింట నలభైపాళ్లు మద్రాసులోనే సాగించడానికీ, 60 వంతులు బొంబాయిలో



అంజలీ దేవి

సాగించడానికి నిశ్చయించారు. కాగా, కథ అవసరాలను బట్టి మిగతా పదివంతుల చిత్ర నిర్మాణం విదేశాలలో జరుగుతుందని సాబీర్ చెప్పారు. ఈ చిత్రాన్ని విదేశాలలో కూడా విడుదల చేయాలనుకుంటున్నట్లు, అదృష్టావశాత్తూ దీన్ని రూపొందించదలచినట్లు తెలియజేశారు. బహుశా చిత్రం అంతా 'సోవా కలర్'లో తయారుచేయడం జరగవచ్చు. 'పరదేశి' చిత్రనిర్మాణం పూర్తి కాగానే, ఆ యూనిట్‌కు చెందిన టెక్నిషియన్‌లు ఈ చిత్రానికి పనిచేస్తారట.

'భగవాన్ ఔర్ సైతాన్'లో జైరాజ్, అచలా సచ్‌దేవ్, డేవిడ్ ప్రభృతులు ప్రముఖ భూమికలు నిర్వహిస్తున్నారు.

అక్టోబరు నెలలో ఈ చిత్రం నిర్మాణం ఆరంభం కావచ్చునని తెలిసింది.

## అశోక్‌కుమార్‌తో అంజలీదేవి

ప్రముఖ దక్షిణ భారత నటి అంజలీదేవి శ్రీకృష్ణా ఫిలింస్ వారి 'ఉస్తాద్' చిత్రంలో ముఖ్యభూమిక స్వీకరించింది ఈ చిత్రంలో ఆమె తొలిసారిగా అశోక్ కుమార్‌తో కలిసి నటించబోతున్నది ఇతర నటులు అనితాగుహ, రెహమాన్, కే ఎన్ సింగ్, భగ్‌వాన్

ఈ చిత్రానికి ఓ పి నయ్యార్ సంగీతం సమకూర్చుతారు

అంజలీదేవి 1960 లోగా ఒక విశ్వవిద్యాలయానికి విరాళం ఇవ్వ నిశ్చయించినట్లు హైదరాబాద్‌లో ప్రకటించడం విదితమే ఆమె పాల్గొనే నూరవచిత్రం పూర్తికావడముతో ఈ విరాళం ఇస్తున్నట్లు ఆమె చెప్పింది రెండువారాల క్రితం అంజలీదేవి బొంబాయివచ్చి షూటింగుకు హాజరయి వెళ్ళింది

## మహారాణాప్రతాప్

ఎస్ కె మాలిక్ తలపెట్టిన చారిత్రక చిత్రం "మహారాణాప్రతాప్" నిర్మాణానికి బొంబాయి మేయరు ఎం వి దోండే ప్రారంభోత్సవం జరిపారు

రజపుత్ర రాణి భూమిక నిర్వహిస్తున్న బీనారాయ్ తొలిసన్ని వేశంలో నటించింది



మహారాణా ప్రతాప్‌లో బీనారాయ్

మహారాజు ప్రదీప్‌కుమార్ అజిత్, విజయ లక్ష్మి, సులోచన, షమ్మీ, కె ఎన్ సింగ్, ఆర్ నజీర్, రణధీర్, అమర్‌నాథ్, భగవాన్‌లు పాల్గొంటున్నారు దర్శకత్వం హూర్చాన్స్ సంగీత దర్శకుడు జమాల్ సెన్

*     *     *

## 'లాజ్‌వంతి'

డీలక్స్ ఫిలింస్ వారి కొత్తచిత్రం 'లాజ్ వంతి' నిర్మాణం మొన్న ప్రారంభమైంది నర్గీస్ తొలిసన్ని వేశంలో పాల్గొంది

'నే నెరుగుదును' అని నీరు తత్కుణం అనబోయే ఒకరకం 'కుటుంబరావు' కథను ఇందులో చిత్రిస్తున్నారు ఈరకం మనిషికి ఊహాలు మంచివే బోలెడు డబ్బు గడించి, ఆలుబిడ్డలను సుఖపెట్టి తనూ సుఖపడదామని ఆర్జన మొదలుపెడతాడు తీరా ఉద్యోగపు గోలలో పడ్డాక, పెళ్లాం బిడ్డలసంగతి అసలు పట్టించుకోడు అంటే అన్నవస్త్రాలకు డబ్బు ఉందిగదా అన్న భావంతోనే ఉంటాడు తప్ప, ఒక ఘడియ స్థిమితంగా కూర్చుని వాళ్లతో సరదాగా మాట్లాడుదాం అన్న ఆలోచన అతనికిరాదు అనేక కుటుంబాలకు సుపరిచితుడుగా కనిపించే ఈ తరహా ఇంటిపెద్ద భూమికను ఈ చిత్రంలో బల్‌రాజ్ సాహ్నీ నిర్వహిస్తున్నాడు నర్గీస్ భార్యగా నటిస్తోంది బేబీ నాజ్, ప్రభు దయాళ్, రాధాకిషన్‌లు కూడా నటిస్తున్నారు ఈ చిత్రానికి దర్శకుడు నరేంద్ర సూరి సంగీత దర్శకత్వం - శంకర్, జైకిషన్‌లు




మాస్కోనుండి మొన్న తిరిగివచ్చిన పద్మిని, రాగిణి

## గురుదత్ కొత్త చిత్రం

సెప్టెంబరు పదవతేదీన, 'ప్యాసా' దర్శక నిర్మాత గురుదత్ తన కొత్తచిత్రం "రాజ్"కు మెహబూబ్ స్టుడియోలో ప్రారంభోత్సవం జరిపాడు ఇందర్ రాజ్ ఆనంద్ వ్రాసిన అపరాధ పరిశోధక ఇతివృత్తంతో, 'హాలీవుడ్-కమ్-బొంబే' పరిభాషప్రకారం 'క్రైమ్‌త్రిల్లర్'గా తయారుకానున్న ఈ చిత్రంలో సునిల్‌దత్ నాయకుడు వహీదా రెహమాన్ అతనికి జత జానీవాకర్ హాస్యగాడు అదీ ఏర్పాటు

## 'త్రిసికిల్' లో వహీదా

'ప్యాసా' చిత్రంలో వహీదా ప్రతిభగల నటి అని ఋజువైంది దానికితోడు, ఆమె పాల్గొన్న చిత్రాలు రెండు (సి ఐ డి, ప్యాసా, వాటికిముందు తెలుగు చిత్రం రోజులు మారాయి) ఘన విజయం సాధించడంతో వహీదా గిరాకీ పుంజుకుంటోంది ఇప్పుడామె నాలుగైదు చిత్రాలలో బుక్

(54 వ పేజీ చూడండి)



'దుష్మన్' చిత్రంలో ఉషాకిరణ్, దేవానంద్ ఫోటో.



"పాండురంగ మాహాత్మ్యం"లో కళావతిగా బి సరోజ

# తెలుగు సినిమా వార్తలు

"ధరసింహాసనమై—" అన్నాడు నారదుడు రాజాగారివంకచూచి స్తుతిపాఠం ఆరంభిస్తూ

"మకరి హాసనమై—"అని వంతపాడాడు అతగాడి జతగాడు

ఊహ మంచిదే ఈ రాజాగారి దగ్గర నాలుగైదు పాతపద్యాలు గబగబ చదివేసి ఆయనగారిని ఉబ్బించి నాలుగు డబ్బులు గడించి, కొంపజేరి పబ్బం గడుపుకోవాలని నారదుడూ, నేస్తం ముందరేకూడ బలుక్కుని వచ్చారు రాజసభలోకి

అయితే ఆ రాజుగారు లాకాయి లూకాయి ఆసామికాదు సాక్షాత్తూ కృష్ణభగవానుడు ఎటొచ్చి కొత్తిగా సాక్షాత్తూ కృష్ణుడుకాదు ఎందుకంటే మామూలు నేరేవాళ్లే రాజువేషం వేసుకొని, నటుడు రకం సభ ఏర్పాటు చేసుకొని కూర్చున్నాడు నారదుడు వస్తాడనీ, డబ్బు అడుగుతాడనీ ఆయనకి తెలుసు దానికి కథ చాలా ఉంది కృష్ణతులాభారము అను సత్యభామా గర్వభంగము పూర్తిఅయి, నలుగురూ చప్పట్లు కొడుతున్న సందర్భంలో, ఆ నలుగురూ పనిలో పనిగా నారదుణ్ణి మెచ్చుకున్నారు ఇతగాడి మడత పేచీల మూలంగా నేకదా పారిజాత తరువు దివినుండి భువికి దిగివచ్చింది! ఇతగాడి వల్ల నేకదా సాత్రాజితిదారికివచ్చింది! అటువంటి దానాదీనా నారదుడికి ఒక దర్వ అహంకారం అబ్బింది చమత్కారం పెరిగింది అది కాస్తా ఎదటివాళ్లకి కాస్త కారంగా తగిలింది సంసార సాగరంఅంటే, పాటలు పాడుతూ మబ్బులలో తిరగడం కాదనిచెప్పి, దాని 'తడాఖా' తెలుపడం కోసం భగవానుడు కొన్ని ఏర్పాట్లు చేశాడు క్షణంలో నారదుడికి సంసారం తతంగం ఏర్పాటుచేశాడు అందువల్ల అతనికి రాజసహాయం కావలసివచ్చింది అందుకనే కృష్ణుడు రాజువేషంలోకూర్చున్నాడు ఈ మాయ చూచాయగా నారదుడికీ తెలుసు అందుకే, స్తుతి అతిగా కనిపించకూడదని, భావించాడు అందుకనే, తన నేస్తం వంత పాడితే, మోచేతితో ఓ పోటుపొడిచి తగ్గు తగ్గు అని మందలించాడు గుంభనగా

"ధర సింహాసనమై", అన్నాడు నారదుడు నాగేశ్వరరావు

'హాసనమై' అన్నాడు నేస్తం వేషంలో ఉన్న చదలవాడ

"ఉష్" అన్నాడు నాగేశ్వరరావు జనాంతికంగా, "నభంబు గొడుగై" అన్నాడు ప్రకాశంగా

'గొడుగై' అని అందుకున్నాడు చదలవాడ మొండిగా

నారదుడిప్రాణం విసుగెత్తి కాలితో ఓ తొక్కు తొక్కాడు బండగా

మెల్లిగా ఏదోఅంటే గట్టిగా ఇంకేదో అనే రకం ఆశిష్యుడు ఆ దెబ్బతో ఎగిరి గంతేసి 'అబ్బ' అని సభలో పరువు తీసేశాడు

## సెభాసనిపించుకున్న అభాసు

నారదుడు కాక మరోడైతే నోరాశలించాల్సిందే ఆ రభసకి అరాజు మరోడైతే ఏమిటిది అని గర్జించవలసిందే కారు కాబట్టి, రాజాగారు ఆ అభాసు చూసి సెభాసని అంటూనే విరగబడి నవ్వడం మొదలు పెట్టారు అటూ ఇటూ ఉన్న చెలికత్తెలు కూడాను రాజాగారి మాట ఎలా ఉన్నా డైరెక్టరుగారు ఏమంటారోనని కాస్త నవ్వాపుకున్నారు

'కట్' అన్నారు డైరెక్టరుగారు కూడా నవ్వుతూ రాజావేషంలో ఉన్న కృష్ణుడి వేషం ధరించిన రఘురామయ్యకు మాత్రం నవ్వాగటం లేదు

ఇంకో రెండు రిహా కానివ్వండి అన్నాడు దర్శకుడు సి రావు

* * *

'ధరసింహాసనమై'

'హాసనమై', అన్నాడు చదలవాడ

'ష్' అన్నాడు నాగేశ్వరరావు

'నభంబు గొడుగై'

'గొడుగై'

ఒక్కతొక్కు తొక్కాడు నాగేశ్వరరావు చదలవాడ కాలుమీద చదలవాడ 'అబ్బ' అన్నాడు గారాబం ఒలకిస్తూ విచిత్రంగా

రాజుగారు మళ్ళీ ఫక్కున నవ్వేశారు .

'కట్' అన్నాడు దర్శకుడు

ఇందర్ని నవ్వించిన నారదుడూ, శిష్యుడూ అమాయకంగా చుట్టూ పరకాయించి చూశారు

శ్రీ రాజరాజేశ్వరీవారి 'కృష్ణమాయ' ఇటువంటి చిన్న చిన్న సన్నివేశాలతో ఆద్యంతం హాస్యరసప్రధానంగా వాహినీలో రూపొందుతోంది. నాగేశ్వరరావు, జమున, రఘురామయ్య, చదలవాడ మొదలగువారు పాల్గొంటున్నారు రచన రావూరి

# సారధీవారి తొలిచిత్రం

సారధీ స్టుడియోస్ పేరిట శ్రీ రామకృష్ణ ప్రసాద్ నిర్మిస్తున్న తొలిచిత్రం సగంవరకూ పూర్తి అయింది.

కలహాలూ కక్షలూ ఎవరికీ ఏనాడూ కలసి రాని పీడలనీ, పల్లెల బలానికి, బాగుకూ ఐక్యత ఆయువుపట్టువంటిదనీ ప్రబోధించే ఇతివృత్తంతో ఒక బడిపంతులు కథ ప్రాతి పదికగా వీరు రూపొందిస్తున్న ఈ చిత్రంలో జానకి, లక్ష్మీరాజ్యం, ఛాయాదేవి, నాగయ్య, రేలంగి, సి ఎస్ ఆర్ గుమ్మడి, వల్లం నరసింహారావు ప్రభృతులు పాల్గొంటున్నారు.

నాయకుడి భూమికను బాలయ్య అనే కొత్తనటుడు నిర్వహిస్తున్న విషయం విదితమే. శోభ అనే మరొక నటినికూడా సారథీవారు ఈ చిత్రంలో పరిచయం చేస్తున్నారు. క్రొత్తవారికి అవకాశం ఇచ్చి ప్రోత్సహిస్తున్న సారథీ సంస్థ ఈవిధంగా అభినందనార్హమైనది. ఈచిత్రానికి తాపీధర్మారావు, నార్ల చిరంజీవి రచన చేస్తున్నారు. సంగీత దర్శకుడు వేణు. దర్శకత్వం చాణక్య.



యన్ ఎ టి వారి "పాండురంగ మాహాత్మ్యం"లో పుండరీకుడుగా ఎన్ టి రామారావు



ఆర్ ఎస్ ఆర్ వారి 'ప్రేమే దైవం'లో శ్రీరంజని, గుమ్మడి

* * *

సెప్టెంబరు 18 వ తేదీన నాలుగుచోట్ల నృత్యాల చిత్రణ జరిగింది.

విక్రం స్టుడియోలో దర్శక నిర్మాత బి ఎస్ రంగా తమ కొత్తచిత్రం "కుటుంబ గౌరవం"లో ఒక నృత్య సన్నివేశాన్ని చిత్రించారు. చెడు తిరుగుళ్ళు మరిగిన కలవారి ఇంటి బిడ్డడు వెలయాలి ఇంట కులుకుతూ నృత్య గాన కాలక్షేపంలో పాలాని గౌరవాన్ని ఝామ్మని గంగలో కలిపేస్తున్న ఘట్టం అది. రాజనాల ఆభూమిక ధరించాడు.

విశ్వనాథం రామమూర్తి (నయా ఆర్మీ) కూర్చిన శ్రుతిపేయమైన సంగీతానికి నృత్య దర్శకుడు చోప్రా, నర్తకి ఇ వి సరోజ చక్కని నృత్యాన్ని జోడించారు. శ్రుతిబద్ధమైన అందెలరవళికి సరోజ లయబద్ధంగా పాదయుగళిని నడపింది. పారాణి వలె రంగుతో అలంకరించిన ఆ పాదాల చలనాన్ని దర్శకుడు ఛాయాగ్రాహకుడు రంగా క్లోజప్‌లో చిత్రించారు.

* * *

వాహినీస్టుడియోలో పొన్నలూరిబ్రదర్స్ వారు 'శోభ' చిత్రానికి ఒక కోయ నృత్యాన్ని చిత్రించారు. రీటా, రాజసులోచన ప్రభృతులు పాల్గొన్నారు. దానికి ఉత్క్రమణికగా, 'స్వస్తిక' ఆకారంలో కాగడాలు పట్టుకున్న కొందరు యువకులను నిలిపి రెండు విన్యాసాలను క్రేన్‌షాట్‌లో చిత్రించారు. నృత్యదర్శకుడు వెంపటి (సువర్ణసుందరి) సత్యం, అరవైడబ్భైమందిపాల్గొన్న ఆ నృత్యాన్ని సునాయాసంగా, ఆలస్యం లేకుండా హుషారుగా నడపుకు వచ్చారు. ఛాయాగ్రహణ దర్శకుడు 'అన్నయ్య' (డి. ఎల్ నారాయణ) ఈ చిత్రానికి ఎ ఎం రాజా సంగీతదర్శకుడు. అంజలీదేవి, రామారావు, రాజసులోచన, రేలంగి, ముక్కామల నటిస్తున్నారు. దర్శకుడు కమలాకర కామేశ్వరరావు.

* * *

ఆరోజునే అనుపమ ఫిలింస్ వారి 'ఎం ఎల్ ఎ' చిత్రానికి ఆఖరు సెట్‌పై పని పూర్తి అయింది. అదీ నృత్యమే. హైదరాబాద్‌కు చెందిన కుర్షీద్ అనే కొత్త నర్తకిని దర్శకుడు తిలక్ ఇందులో పరిచయం చేస్తున్నారు. ఒక పుట్టినరోజు పండుగ వేడుకలో ఆమె చేసే ఈ నృత్యాన్ని వేణుగోపాల్ కూర్చారు. సంగీత దర్శకుడు పెండ్యాల నాగేశ్వరరావు. ఛాయాగ్రహణ దర్శకుడు లక్ష్మణ్ గోరే.

* * *

ఎన్ ఎ టి వారి 'పాండురంగ మాహాత్మ్యం' చిత్రం సంగీత దర్శకుడు టి వి.



విక్రం ప్రొడక్షన్స్‌వారి "కుటుంబగౌరవం"లో సావిత్రి, రామారావు, ఉమ.

## తెలుగు సినిమా వార్తలు

రాజా ఆ రోజునే గోల్డెన్ స్టుడియోలో మూడు పాటలు రికార్డు చేశారు ఒకటి ఘంటసాల పాడారు ఇది కబీర్, తులసీదాస్ ప్రభృతుల భజన గీతాల గుచ్ఛం మరొకటి ఘంటసాల, కోమలా కలసి పాడారు మరొకటి బృందగానం ★

## బొంబాయి సినిమా వార్తలు

(50-వ పేజీ తరువాయి)

అయింది వాటిలో నవకేతన్ వారి చిత్రం ఒకటి అందులో దేవానంద్ తో కలిసి నటిస్తుంది ఇటీవల బసు చిత్ర మందిర్ (బందిష్) వారి తరువాతి చిత్రం 'సైకిల్'లో నాయికి భూమిక స్వీకరించింది ఇందులో ఆమె కిశోర్ కుమార్ తో కలసి నటిస్తుంది ఇతర నటులు నజీర్ హుసేన్, బిపిన్‌గుప్త, జగ్‌దేవ్, డెయిసీ ఇరానీ దీనికి దర్శకుడు సత్యేన్‌బోస్ సంగీత దర్శకుడు హేమంత కుమార్.

### వైజయంతిమాల బదులు మధుబాల

దర్శక నిర్మాత బి మైత్రా, తన కొత్త చిత్రం 'ఫగుణ్'లో నాయకి భూమిక నిర్వహణకు వైజయంతిమాలస్థానే మధుబాలను నియోగించారు పని రద్దీవల్ల, 'ఫగుణ్' చిత్రానికి కావలసిన 'షూటింగ్ డేట్'లు వైజయంతిమాల మంజూరు చేయలేనంది అందువల్ల మైత్రా ఆమెను తొలగించి మధుబాలను నియమించడం జరిగింది 'ఫగుణ్' చిత్రానికి విశేషాకర్షణ శాస్త్రీయ బాణీలలో ఓ పి నయ్యార్ కూర్చుతున్న సంగీతం అని చెబుతున్నారు

### రాజ్‌కపూర్‌తో నూతన్

ఎల్ బి లల్లా నిర్మించబోయే "అనాడి" చిత్రంలో రాజ్‌కపూర్, నూతన్, మోతీలాల్ పాల్గొంటారు

దీనికి శంకర్ జైకిషన్‌లు సంగీతం సమకూర్చుతారు

* * *

వరనూవారు నిర్మిస్తున్న "బీ తేదిన్" అనే హిందీచిత్రంలో నర్తకి కమలాలక్ష్మణ్ ఒక భూమిక-హాస్యగాడు రాధాకిషన్‌కు జంట-నిర్వహిస్తోంది ఇందులో నాయకీనాయకులు నిమ్మి, అశోక్‌కుమార్ దర్శకుడు మోహన్ సెగాల్, నిర్మాణం నాలుగింట మూడుపాళ్లు పూర్తి అయింది

* * *

కల్పనా పిక్చర్స్‌వారి "మంజిల్" చిత్రంలో కథ కొంతవరకూ కొత్తరకం అవచ్చును ఇందులో ఒక అమ్మడు, ఇష్టం లేకపోయినా, ఒక పెద్ద సైనికోద్యోగిని వివాహం చేసుకుంటుంది కాపరానికి వెళ్ళినా ఆమె ప్రియుడిని మరువలేక, ఆ సంగతి చెప్పలేక మథనపడుతూ వుంటుంది దంపతులిద్దరి జీవితాలూ దుర్భరం అవుతాయి భర్త సకాలంలో కుడిఎడమలు ఆలోచించుకొని, తన భార్యను ఆమె ప్రియుడికిచ్చి పెళ్ళిచేస్తాడు ఇందులో భార్యాభర్తలుగా నూతన్, కృష్ణదివాన్‌లు, ఆమెప్రియుడుగా దేవానంద్ నటిస్తున్నారు.

దర్శకుడు మండీబర్మన్, సంగీత దర్శకుడు శచిన్‌దేవ్‌బర్మన్

మువీస్టార్స్‌వారి "అభీదావ్" మహేష్ కౌల్ దర్శకత్వాన చురుకుగా తయారవుతోంది శేఖర్, నూతన్, సుభాఖోటే, జీవన్, నజీర్ హుసేన్, షమ్మీ, బుధూ అద్వానీ, ధుమల్, జానీవాకర్ నటిస్తున్నారు సంగీతం మదనమోహన్ సమకూర్చుతున్నారు

* * *

ఎం సాదిక్ 'ఖోటా పైసా' అనేచిత్రం నిర్మిస్తున్నారు శ్యామా, జానీవాకర్, జీవన్, విజయలక్ష్మి, అన్వారీ, ధుమల్, ఎస్ ఎన్ బెనర్జీ పాల్గొంటున్నారు సంగీతం ఓ పి నయ్యార్ ★

## సత్యజిత్‌రాయ్ (49-పే తరువాయి)

చిత్రాలను గౌరవించడానికి ఈ బహుమతి ప్రదానం ఏర్పాటుచేయడం జరిగింది

భారతీయ చిత్రానికి ఈ బహుమతి లభించడానికి ఇదే తొలిసారి

### 'అపరాజిత'

కాగా రాయ్‌కి ఈ ఏడాది ఘనవిజయం అనతగ్గది వెనిస్ అంతర్జాతీయ ఉత్సవంలో 'అపరాజిత'కు లభించిన 'సువర్ణసింహ' విగ్రహ బహుమానం ప్రపంచ ఉత్సవాలలో అగ్రగణ్యం అనతగ్గ ఈ ఉత్సవంలో ఇదే అగ్ర బహుమానం భారతీయ చిత్రం దీన్ని అందుకోవడం ఇదే తొలిసారి అమెరికా చిరకాలంగా పాల్గొంటున్నా, ఇక్కడ ఐదుసార్లు ద్వితీయ బహుమతులను (రజత సింహ విగ్రహాలు) మాత్రమే సాధించగలిగింది మరో విశేషం 'అపరాజిత' ఇక్కడ మరి రెండు బహుమతులు సంపాదించడం ఒకటి చలనచిత్ర విమర్శకుల బహుమతి, మరొకటి ఈఉత్సవంలో ఉత్తమ చిత్రానికి ఇచ్చే ప్రత్యేక బహుమతి ఈమూడు బహుమతులను ఒకేసారి ఒక చిత్రం అందుకోవడం ఇదివరకెన్నడూ జరుగలేదు

దేశదేశాల చలనచిత్ర దర్శకులూ నిర్మాతలూ, కళాకారులూ, విమర్శకులూ సత్యజిత్ రాయ్‌ని అభినందనలతో ప్రశంసలతో ముంచెత్తివేశారు అపరాజితకు తరువాయి కథకూడా చిత్రం తీయాలన్నారు ప్రముఖ ఇటాలియన్ దర్శకులంతా ఆయన గౌరవార్థం విందులుచేశారు తమతమ స్టుడియోలకు ఆహ్వానించి, అన్నీ చూపించారు.

### నీతికథ

సత్యజిత్ రాయ్ విజయగాథ, చలనచిత్ర నిర్మాతలు శ్రద్ధగా చదవతగ్గ నీతికథ, ఈ దేశం సర్వదా మననంచేసుకోతగ్గ ఖ్యాతి కథ

కళాదృష్టితో చిత్రాలు తీసి ఉత్తమ స్థాయిని అందుకోదలచిన ప్రతి



"ప్రేమేదైవం"లో గుమ్మడి

వలన చిత్ర కళాకారుడూ, ఈ విజయాలను సాటికి కారణమైన కృషిని, చిత్తశుద్ధిని దృష్టిలో ఉంచుకొని, ఆత్మ విమర్శన చేసుకొని ఉపక్రమించడం మంచిది

'పథేర్ పాంచాలీ' ప్రటకలకు పూర్వం సత్యజిత్ రాయ్ చిత్రకారుడు వ్యాపార ప్రకటనలకు చిత్రాలు వేసి ఆకర్షణీయంగ రూపొందించడం అతడి పని చలనచిత్ర నిర్మాణం అనుభవం ఏమీ లేదు—ఇతగాడి మిత్రుడు సుబ్రతమిత్రా కూడా ఇలాంటి వాడే అతనికి ఫోటోగ్రఫీ అంటే అభిమానం ఫిలిం కెమేరాతో అప్పటికి ఆట్టే పరిచయం లేదు అయినా ఇద్దరికీ ఒకలక్ష్యం ఉండేది, 'పథేర్ పాంచాలీ'ని చలన చిత్రంగా నిర్మించాలని ఒకనాడు అందుకు పూనుకొని పని ఆరంభించారు ఆ చిత్రంలో నటీనటులంతా కొత్త వారే (ఒక్కరు తప్ప) అనుభవం లేదు గ్లామర్, స్టార్ వాల్యూ అంతకన్న లేవు వారితో ఈ దర్శకుడు తీసిన చిత్రంలోకూడా బాక్సాఫీసు సూత్రాల ఛాయలు—ఫైట్లు డాన్సులూ, వికిలి హాస్యమూ వగైరా ఎక్కడా పడలేదు చివరకు ఆ చిత్రం, బెంగాల్‌లో ఆర్థిక విజయమూ సాధించింది, కాన్స్ ఉత్సవంలో బహుమతి, ప్రపంచ కళాకారుల ప్రశంసలూ సాధించింది ఒక ఘట్టంలో డబ్బులేక చిత్ర నిర్మాణం ఆగిపోగా పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి డా॥ బి సి రాయ్ ఆదుకుని లక్ష రూపాయలు ధన సహాయం మంజూరుచేశారు చిత్రం ఏమిటంటే, ఆ విధానికి ఈ చిత్రం ఉత్తమ భారతీయ చిత్రంగా రాష్ట్రపతి బహుమతి (సువర్ణ పతకం) సంపాదించుకున్న సందర్భంలో, బహుమతిని అందుకొన్న వాడు సత్యజిత్ రాయ్ కాదు డబ్బు పెట్టుబడి పెట్టిన ప్రభుత్వం అందుకై ఒక ఉద్యోగిని పంపింది

"అపరాజిత" ఇతడు స్వయంగా నిర్మించిన చిత్రం

డబ్బు ఇబ్బందులు ఎన్ని ఉన్నా, వ్యక్తిలో కళాత్మకమైన శక్తిఉండి, అతడు చిత్తశుద్ధితో కష్టపడి పనిచేస్తే సర్వసర్వత్రా ప్రశంసలూ, అంతర్జాతీయ బహుమతులూ అందుకోగలగడం అసాధ్యం కాదని ఋజువు అవుతోంది అంతేకాదు "స్టార్ సిస్టం" అనబడే తారారాధనా విధానానికీ, చిత్రం విజయానికీ (కళాదృష్ట్యా) ఏమీ సంబంధం లేదని కూడా ఋజువవుతుంది ★

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)

## న్యూఢిల్లీలేఖ

(5-వ పేజీ తరువాయి)

కాలా అందజేయలేదని హఠాత్తుగా శ్రీ జగ్జీవన్‌రాం గ్రహించారు. అయితే కొంచెం ఆలస్యంగా గ్రహించారు కాని బండారం బయటపడనే పడింది దీనివల్ల టాటా కంపెనీ తయారుచేసే రైల్వే ఇంజనుల ధరలను పునర్విమర్శించవలసి రావచ్చు దీనితో పాటు మరొకటికూడా జరగాలి అజ్మీరు లోకోమోటివ్ షాపు 1950 నుంచీ కాక 1940 నుంచీ ఉత్పత్తి మానేసిందని రైల్వే బోర్డు ఎగుమతి దిగుమతి సుంకాల సంఘంతో ఎందుకు చెప్పిందో విచారణ చెయ్యాలి ఎందుకంటే ఆ తప్పుసమాచారం మీదనే ఆ సుంకాల సంఘం చాలావరకు ఆధారపడి సిఫార్సులు తయారు చేసింది

ప్రజాప్రతినిధిగా శ్రీ ఫిరోజ్ గాంధీ తన కర్తవ్యం తాను చక్కగా నెరవేర్చారు ఈయనగాని, మరో సభ్యుడుగాని దామోదర్ లోయ కార్పొరేషన్ గురించిన ప్రశ్న కూడా వేస్తారేమోనని కొందరు ఎదురు చూస్తున్నారు దామోదర్ లోయ కార్పొరేషన్ ఒకానొక కంపెనీకి ఇవ్వవలసిన దానికంటే ఒక కోటి ఇరవైలక్షల రూపాయలు ఎక్కువ చెల్లించినట్లు ఒక ఆరోపణఉన్నది ఆ అదనపు ధనాన్ని తిరిగి ఎందుకు వాపసు చెయ్యలేదని ఇక్కడి లాబీ వర్గాలు అడుగుతున్న ప్రశ్న ★

## విక్రమార్కుడి మార్కు సింహాసనం

(12-వ పేజీ తరువాయి)

యూర్, మెయ్యప్పన్, ఇంకా, ఇలా ఎందరో కొత్తగా సినిమా తీసినప్పుడల్లా నాదగ్గిర ఎలాగో అలా లాంఛనానికి ఒక్క కాణీయో వంద రూపాయలో పుచ్చుకున్నారట సిసిల్ డిమిల్ 'శామ్సన్ డిలైలా' తీసినప్పుడు విమానంమీద మా అంగలకుదురు వచ్చేసి, నాదగ్గిర రూపాయ తీసుకొని దాన్ని డాలరుగా మార్చుకుని మళ్లీ విమానం మీద వెళ్ళిపోయి, శామ్సనువేషం వేసిన విక్టరుమెచూరుకి ఇచ్చిన ఎడ్వాన్సులో ఈ డాలరు ముక్కని గుట్టుగా కలిపేశాడుట ఇది పెద్ద సీక్రెటు అనుకో ఎవరికీ చెప్పకుసుమీ ఒట్టేనా? (ఒట్టేసు అని రాజా ఒట్టేసి అరచెయ్యి గిల్లాడు )

ఏముంది ఎంత రహస్యంఅయినా మూడో నాటికల్లా గుప్పుమంది అందరూ ఇదే గుసగుసలాడడం ఒకాయన నాతోనే చెప్పేడు నువ్వు పూర్వజన్మంలో కుబేరుడివి తెలుసా? అని

ఒక సెంటరుందిలే అక్కడ చెప్తారు మనం పూర్వజన్మంలో ఎవళ్ళెవళ్లమో

నాక్కూడా గర్వం వచ్చింది, ఇంక ఫరవాలేదూ తిక్కెం జేమసలు చాలా లేకుండానే హైక్లాసు స్టార్లని బుక్కు చేసెయ్యొచ్చునని మందగ్గిర డబ్బులేదుగాని కాళ్ళు దొరికితే డబ్బువచ్చేస్తుందిలే డిస్ట్రిబ్యూటర్ల దగ్గిర్నించి

ఓహో ఎంతవాణ్ణి నేను అని సంతోష పడడం మొదలుపెట్టాను ఓ పావుగంటో పది నిముషాలో సంతోషించేసరికి ఏమయిందంటే,—

అంటూ బాబు గబుక్కున బల్లకింద దూరిపోయాడు హఠాత్తుగా — 'తరువాతికథ తరవాత చెబుతా కొంచెం ఆగు' అంటూ— (సశేషం) ★

# ఏడం కెల బావ

(10 వ పేజీ తరువాయి)

కళ్ళుపోతాయ్" అన్నాడు పురోహితుడు.

"సరేలేండి. వినాయకస్వామిని నా తప్పులన్నీ మన్నించమని ఏడుగుంజిళ్ళు తీస్తాను" అంటూ బావవైపు చూచి. ఒక చిన్న నవ్వు నవ్వి, ఒకటీ...రెండూ...అనడం మొదలెట్టాడు.

"మూడుసార్లు చాలుబాబు."

"వుండండీ.మాబావకు ఏడుఅంటే ఎంతో ప్రీతి"అంటూ ఏడు గుంజిళ్ళు తీశాడు గోపి.

పాపం. పిల్లికి చెలగాటం, ఎలుకకు ప్రాణ సంకటమన్నట్లుగా గోపికేమో ప్రతిదీ ఏడంకెతో పోల్చటం సర్దా. మరి మురళీధరరావు కేమో రానురాను అదోక ఎగతాళిగా తెలియ వచ్చింది.

ఎందు కొచ్చానురా బాబు పండక్కి అని మనస్సులో దిగులుపడుతునే వున్నాడు.

అందరూ భోజనాలకు కూర్చున్నారు. సుశీల బజ్జీలు పట్టుకొచ్చింది. అందరికీ వడ్డించింది. మురళీధరరావు ప్రక్కనే గోపి కూర్చున్నాడు. బజ్జీలు వడ్డించటంతోనే గోపి వాటిని లెఖపెట్టాడు. "దొరికావురా దొంగ" అనుకుంటూ "బావా, అక్కయ్య మా కందరికీ 4, 5 బజ్జీలు వేసి, నీకేమో లెక్కపెట్టినట్లు ఏడు బజ్జీలు వేసింది చూడు" అన్నాడు.

మురళీధరరావు విస్తరిలోకి చూచాడు. అవును నిజంగా ఏడు బజ్జీలే! అతనికి ఆ సమయంలో సుశీలమీద అమితకోపం వచ్చింది. యిటువైపుమామగారు కూర్చున్నారు. అటువైపు గోపి తలవంచుకొని నవ్వుతున్నాడు. ఏమంటానికీ నోరు పెగలలేదు. ఏడు బజ్జీలూ ఎలాగో ఆరగించాడు.

అంతా విశ్రాంతి తీసుకోవటానికి మంచాలమీదకు జారగిల్లారు. మురళీధరరావు కేమో ఆ ఏడంకె గోపికి ఎలా తెలిసిందో తెలియక తికమకపడుతున్నాడు.

ఎంత ప్రయత్నించినా నిద్రపట్టటంలేదు. టైము మూడుగంటలైంది. సుశీల కాఫీ గ్లాసుతో గదిలోకి ప్రవేసించింది గోపి చేసే అల్లరి సుశీతో చెప్పి మందలించమందామనుకొన్నాడు. "ఐతే సుశీలకు కూడా తన బలహీనత తెలిసిపోతుందేమో" అనే సందేహం కలిగేటప్పటికి చెప్పటం మానేశాడు.

"ఏమండీ! ఏమిటీ ఆలోచిస్తున్నట్లున్నారు?" అంది.

"ఏమీ లేదులే! కొస్త మంచినీళ్లు తీసుకురా" అన్నాడు ఆమెను గదిలోంచి వెంటనే బయటకు పంపేందుకు.

సుశీల బయటకు వెళ్లింది. గోపి పరుగున గదిలోకి వచ్చి: "బావా, నీకు టెలిగ్రాం వచ్చింది" అంటూ ఒక కవరు ఇచ్చాడు.

మురళీధరరావు కవరు విప్పి, టెలిగ్రాం చదువుకున్నాడు. వళ్ళు మండిపోయింది. "వెధవ ఆఫీసు, ఏడురోజులు శెలవిచ్చారో లేదో మునిగిపోయినట్లు టెలిగ్రాంఇచ్చారు. అర్జంటుగా రావాలట. అర్జంటు" అంటూ ఏదో తనలో గొణుగుకొంటున్నాడు.

"ఏమిటి బావా టెలిగ్రాం?" అన్నాడు గోపి.

"మురళీధరరావ్! ఏదో టెలిగ్రాం వచ్చిందట! ఎక్కడనుంచి?" అంటూ,రామనాథంగారు గదిలో ప్రవేశించారు.

"ఆఫీసు నుంచండి" అంటూ కవరు అందించాడు.

టెలిగ్రాం చదువుకొన్న రామనాథంగారు "ఏ మాఫీసయ్యా ఇది! పండక్కని, అత్తవారింటికి వస్తే, అర్జంటుగా క్యాంపు కెళ్లాలని టెలిగ్రాం ఇచ్చి పిలిపిస్తారా" అంటూ చిరాకుపడ్డాడు.

రామనాథంగారి చేతిలోంచి గోపి టెలిగ్రాం తీసుకొన్నాడు. ఏమీ అర్థంకాలేదు. అయితే విడివిడిగా వ్రాసిన మాటలనుమాత్రం లెక్క పెట్టకుండా వుండలేకపోయాడు. అవిసరిగ్గా ఏడుమాటలేవున్నాయి. తనలోనే నవ్వుకున్నాడు నాన్నారు కోపంగా వున్నారని.

రామనాథంగారు గదిలోంచి వెళ్ళిపోయారు. సుశీల మంచినీళ్లతో గదిలోకి ప్రవేశించింది. టెలిగ్రాం విషయం నాన్న చెప్పుతుంటే విన్నది కాబట్టి మురళీధరరావును ఏమీ ప్రశ్నించలేదు.

"బావా! నీవు వూరి కెళ్లిపోతావా?" అన్నాడు గోపి బిక్కముఖంతో.

"నీవు వెళ్ళిపోతే నాకు తోచదు బావా" అన్నాడు కొస్త దగ్గరకొస్తూ.

గోపిని మురళీధరరావు చూశాడు. జాలి వేసింది. గోపిమీద అంతవరకున్న కోపమంతా మాయమైంది. "గోపి ఎంత మంచివాడు. తను వూరికి వెళ్ళిపోతానేమోనని బిక్కముఖం వేశాడు సుమా!" అని తనలో తాను అనుకొన్నాడు.

"అవును గోపి. మళ్ళీ వస్తాలే. యివాళే, సాయంత్రం ఏడుగంటల బండికి తప్పకుండా వెళ్ళాలి" అంటూ తన దగ్గరకు తీసుకొన్నాడు గోపిని.

"ఆ. భలేబండి!" అంటూ చేతిని విదిలించుకొని:

"చూడుబావా. నీవు ఏ నాలుగురోజులో సెలవు పెట్టుంటే ఇలా టెలిగ్రాం ఇచ్చి పిలిపించేవారుకారు. నీకు ఏడురోజుల శెలవిచ్చి, టెలిగ్రాంద్వారా పిలిపించారు. కాబట్టి నీవు ఏడుగంటల బండికే వెళ్ళాలి. నీకు ఏడంకే అచ్చిరాదు బావా...మా ఏడం కెల బావకూ జై" అంటూ పరుగుతీశాడు బజారులోకి.

సుశీ నవ్వింది.

మురళీ ముఖం వెలవెలపోయింది. ★

# పెరుగుతో పెసరట్ల కూర

(41-వ పేజీ తరువాయి)

ఎర్రగా కాలిన తరువాత, చిన్న చిన్న ముక్కలుగా కోసి పెరుగులో వెయ్యవలెను. ముక్కలపై పెరుగు వుండేవరకూ వెయ్యాలి. లేకపోతే పెరుగు చాలక బాగుండదు. పొయ్యిమీద గిన్నె కాలవేసి, పిడికెడు మినప్పప్పు, రెండు చెమ్చాలు ఆవాలు, ఎనిమిది ఎండుమిరపకాయ ముక్కలు ఒక అర్ధపావు నూనెలో దోరగా వేయించి అట్లు, పెరుగు కలిపిన గిన్నెలో ఈ పోపు వెయ్యాలి. నాలుగు కరివేపాకు జంటలుతీసి ఎర్రగా వేచి కలుపుకుంటే కమ్మగా వుంటుంది. ఈ గిన్నె తిరుగా పొయ్యిమీదపెట్టి ఐదు, ఆరు నిముషములుంచి దింపవలెను. ఈ కూర అన్నములోకిగూడా ఆధరువుగా వుంటుంది. టిఫిన్‌గా కూడా వాడవచ్చు. తొల్నాడు చేసింది.-మర్నాడు పొద్దున్న వరకు పాడైపోకుండా వుంటుంది.

డి. అన్నపూర్ణ (విజయనగరం)




Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad



పండు ముసలిది

—ఫొటో : ఎమ్. శ్రీనివాసన్, మద్రాసు]

Regd. No .M.4479. Andhra Patrika Illustrated Weekly



# మీ కుటుంబమునకు ఒక పండుగ కానుక

# ఆల్-వేవ్ నేషనల్-ఎక్కో రేడియో 

## రు. 200/00 మొదలుకొని వివిధ ధరలు

వచ్చే పండుగ శుభ సమయములో మీ కుటుంబము నకు ఒక నేషనల్-ఎక్కో రేడియోను కొనిపెట్టండి. ఈ దివ్యమైన కానుకకు యింటిలో పిన్నా పెద్దా అందరూ ఎంతో సంతోషిస్తారు!

ఈ దిగువ 6 పొగ్గనైన నేషనల్-ఎక్కో మోడలు చూపబడినవి. ఎందుకొందుకు యింకా ఎన్నో రకము లవి దొరకుతున్నాయి. నేషనల్-ఎక్కో వ్యాపారివద్ద వాటిని నేడే చూడండి.



మోడలు 241 5 వాల్వులు. 3 బ్యాండులకు సమమైన 2 బ్యాండుల ఎసి/డిసి సెట్. 4 వాల్వులుగల డ్రై బ్యాటరీ సెట్ కూడ ఉంది. రు 200/00 నెట్



మోడలు బి-703: 5 వాల్వులు. 3 బ్యాండులుగల డ్రై బ్యాటరీ సెట్. రు 325/00 నెట్



మోడలు బి-712: 6 వాల్వులు. 5 బ్యాండులు. బ్యాండ్ స్ప్రెడ్ చేయబడిన డ్రై బ్యాటరీ సెట్. రు. 475/00 నెట్



మోడలు ఎ-703 5 వాల్వులు. 3 బ్యాండులుగల ఎసి సెట్. రు 325/00 నెట్



మోడలు 187: 6 వాల్వులు. 5 బ్యాండులు బ్యాండ్ స్ప్రెడ్. ఎ-187 ఎసి సెట్. యు-187 ఎసి/డిసి సెట్. రు 475/00 నెట్



మోడలు ఎ-317: 7 వాల్వులు. 8 బ్యాండులు. బ్యాండ్ స్ప్రెడ్ చేయబడి నవి. ట్యూనింగ్ ఆర్. ఎఫ్. స్టేజి కలదు. ఎసి సెట్. రు. 595/00 నెట్

నేషనల్-ఎక్కో రేడియోలు శ్రేష్ఠమైనవి — అవి మాన్సూనైజ్ చేయబడినవి

ఏ నేషనల్-ఎక్కో వ్యాపారియైనా వీటిని మీకు ఉచితముగా పెట్టి వినిపించుటకు సిద్ధమే. ఈ రేడియోలతో 12 నెలల గ్యారంటీ కలదు. స్థానిక పన్నులు అదనము.



జెనరల్ రేడియో & అప్లయన్సెస్ ప్రైవేట్ లిమిటెడ్

ఒ. పెరా హౌస్. బొంబాయి 4 • 3 మదన్ స్ట్రీట్. కలకత్తా 13
1/18 మౌంట్ రోడ్, మద్రాసు • 30/79 సిల్వర్ జూబ్లీ పార్క్ రోడ్, బెంగుళూరు • హార్డింగ్ కాలనీ, చాందిని చౌక్, ఢిల్లీ